Photo by Anant Desai



బహుమతి
పొందిన వ్యాఖ్య

వ న చ రు లు

పంపినవారు:
వి. సి. నియోగి - రాజమండ్రి

*





హమాం నాకు అంత యిష్టమైనది ఎందుకంటె–



అది నాకు ఎంతో ఉత్సాహము నిచ్చును:







(దాని పొదుపునకు కూడ మీరు యిష్టపడతారు... ఎందుకంటె ప్రతి బిళ్ల ఎంతో కాలము వచ్చును!)

అది మంచి సబ్బు అని మీకు నిశ్చయముగ తెలుసు. ఎందుకంటె అది టాటా తయారు ఇండియా పెట్టుబడితో, ఇండియా నిర్వహణ క్రింద, ఇండియాలోనే తయారవుతున్నది.

శ్రీ.ఎ. ఎఫ్ ఎస్. తలియార్‌ఖాన్‌గారి టాటా స్పోర్ట్స్ రెవ్యూ ప్రతి మంగళవారము, లక్ష్మివారము, శనివారముల రాత్రి 9 గంటలకు రేడియో సిలోన్‌లో వినండి

TS. 9771

# ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు





ఇవిగాక - రంగులబొమ్మ కథ,
ఫోటోశీర్షికల పోటీ - మొదలైన మరిఎన్నో ఆకర్షణలు



## చందాదారులకు మనవి



పైనెల చందమామ యీనెల చివరి వారంలో పోస్టు అవుతవి. సకాలంలో అందనివారు, వారి పోస్టాఫీసులో ఫిర్యాదు చేస్తూ, పై నెల పదోతేదీలోగా మాకు తెలియపర్చ గోరుతాము. ఆ పైబడుపచ్చు కంప్లెయింట్లు, గతనెలలో చేరలేదనే కంప్లెయింట్లు గమనించబడవు.

మేనేజరు

# గుపగుపలు






"జె. బి. మంఘూరామ్‌వారి రాయల్ క్రీం బిస్కత్తుల పెట్టె ఒకటి కొనిపెట్టుమని మీ నాయనను అడుగు. ఈ బిస్కత్తులలో గల మీగడ పరిమళం నీ కెంతో ఇష్ట మవుతుంది."

విటమిన్లతో నిండిన
మేలయిన రకము

గాలి చొరని ఆకర్షణీయమైన ప్యాకెట్లలో, మంఘూరామ్‌వారి రాయల్ క్రీం బిస్కత్తులు బహుమతి చేయుటకు తగియున్నవి!

**J. B.**
**MANGHARAM'S**
**ROYAL**
**CREAM**
**BISCUITS**

## జె. బి. మంఘూరామ్ అండ్ కో., గ్వాలియర్.

బ్రాంచి: 35/37 తంబుచెట్టి స్ట్రీట్, జి. టి. మద్రాసు.

# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

ఈ సంచికలో కొన్ని చక్కటి కథలు మీరు చదవబోతున్నారు. 'తపః ఫలం' అనే చిన్న కథలో ప్రజలు చూపిన రాజభక్తి, రాజు కనబరిచిన ప్రజానురక్తి సాటిలేనివి. అలానే, 'ప్రజాహితం' అనే కథలో రాణి అహల్యాబాయి తన రాజ్య ప్రజలలో ఒకతె ఐన రుక్మాబాయిని సరిగా అర్థంచేసుకొని, ఆమె మనవిని మన్నించింది. రుక్మాబాయి ఉద్దేశాన్ని ప్రజలకు నచ్చజెప్పి, వారి మెప్పును పొందింది. ఇటువంటి సంఘటనలు అపూర్వములే ఐనా, నేటికిన్నీ ఆదర్శాలుగా నిలిచిపోయినై 'మాట నమ్మకం' అనే గేయం దుష్టుల మనస్తత్వాన్ని చక్కగా నిరూపిస్తున్నది—లొట్టిపిట్ట శరణుకోరటం, మృగరాజు అభయమివ్వటం, దుష్ట వాయస జంబుకాదులు కుట్రపన్ని వాటి పంతం నెగ్గించుకోవటం, చివరకు సింహం మాటతప్పటం—ఇవన్నీ మనకు గొప్ప మెలకువలను నేర్పుతున్నాయి.



సంపుటి 15 : ఆగస్టు 1954 : సంచిక 2



# మాట నమ్మకం...

దారితప్పి లొట్టిపిట్ట
కారడవుల తిరిగి తిరిగి
మృగరాజగు సింహమునకు
అగుపించిన దొక్కనాడు.

సింగమడుగ నా ఒంటెయు
సంగతెల్ల వివరింపగ
తన బంటయి అడవిలోన
మనుమన్నది హరి దానిని.

ఒరులచేత తనకు హాని
జరుగకుండ చూచెదనని







మాటయిచ్చు నా సింగపు
మాట మీరలేదు ఒంటె.
ఒక్కనాడు మృగరాజము
స్రుక్కె చాల జబ్బుచేసి
వేటాడగ శక్తి లేదు,
పూటకింత తిండి లేదు.
వాయసమును పెద్దపులియు
మాయనక్క హరిమిత్రులు
ఒంటెను తినివేయుమనుచు
ఇంటికేగి వేడుకొనిరి.
పాపమనియె మృగరాజము
చేపట్టినవాని తినుట,
తిండిలేక చచ్చిననూ
ఖండితముగ తినననియెను.








చెప్పసాగె సింహంబును;
ఒప్పుకొనదు వాని తినగ.
మరియాదను మదినెంచుచు
హరి వాటిని తినలేదను
నమ్మకమున ఒంటెకూడ
సమ్మతించె తన్ను తినగ.
అడుగుటయే తడవు; మీద
పడినవి జంతువు లన్నియు
చంపివేసి యా ఒంటెను
నింపుకొనియె తమ పొట్టలు.

"ఒంటె తన్ను తినమని తా
నింటికొచ్చి నిన్నడిగిన
తినుట కష్టపడవె?" యనిన
తినెదననియె సింహమపుడు.
ఎత్తువేసి మూడు కలసి
మెత్తని ఆ ఒంటెతోడ
చిక్కియున్న సింహంబును
ఒక్కసారి కన చనినవి.
"నన్నుతినుము" "నన్నుతినుము"
"నన్నుతిను"మటంచు హితులు
ప్రేమలొలుకు పలుకులతో
మృగరాజును వేడుకొనిరి.
హితులను భక్షించుటయే
హితవుకాదు తనకటంచు






# ఇష్టంలేని న్యాయం

పూర్వం ఒక గ్రామంలో రామయ్యా అనే కాపు ఉండేవాడు. ఆయన భార్య గంగమ్మ గయ్యాళి. తమకు భగవంతుడింత ఇచ్చాడుగదా అని మిడిసిపడేది.

ఒకనాడు రామయ్యా, గంగమ్మా పొరుగూరులో బంధువుల ఇంట అక్కర అయితే వెళ్ళి కాలినడకను తిరిగివస్తున్నారు. మసకచీకటి పడుతున్నది. గ్రామంకూడా అంత దూరంలో ఉన్నది. వారిదారిలో మామిడి చెట్టొకటి ఎదురయింది. చెట్టు నిండా మామిడిపళ్ళు, కొన్ని పండినవీ కొన్ని ఇంకా పండనవీ కనిపించాయి.

"ఇదుగో, ఓయ్! కాస్త మామిడి చెట్టెక్కి మంచి పళ్లుగాచూసి కోసిపెట్టవూ? ఈ ఏడు మామిడిపండెట్లా ఉంటుందో రుచే చూడలేదు," అన్నది గయ్యాళి గంగమ్మ.

"పొద్దుపోయింది. కావలిస్తే రేపు బుట్టెడు తెప్పిస్తాలే!" అన్నాడు రామయ్యా.

"నాకిప్పుడే కావాలి. చెట్టెక్కి రెండు పళ్ళు కోస్తేపోయే దానికి రేపు బుట్టెడు తెస్తాట్ట!" అని సాధించింది గంగమ్మ.

గత్యంతరంలేక రామయ్యా చెట్టెక్కటానికి వెళ్ళాడు. ఆయన చెట్టుకిందికి వెళ్ళాడోలేదో చెట్టు కొమ్మమీదినుంచి ఎవరో ఆయనపై పడ్డారు. రామయ్యా కింద పడిపోయాడు, కాలు పట్టుకుపోయింది.

"అయ్యో! అయ్యో! నీకెంత పొగరురా! కావాలని నా మొగుడిమీద విరుచుకు పడతావురా?" అని కిందపడిన కొత్త మనిషిని ఆడిపోయసాగింది గంగమ్మ.

ఆ మనిషి లేచి రామయ్యాను లేవదీస్తూ, "అమ్మా, తల్లీ! నేను కాలుజారి పడ్డాను. కావాలని పడలేదు. దేవుడుసాక్షి!" అంటూ ప్రాధేయపడ్డాడు. కాని గయ్యాళి గంగమ్మ వినిపించుకోలేదు. గుడ్లెర్రచేసి చేతులు వూపుతూ "నిన్ను పూళ్లోచెప్పి ఏంచేయిస్తానో

జె. వి. కుమార్

చూడు! నీ అబద్ధాలు గంగమ్మదగ్గరనా?" అంటూ తిట్టసాగింది.

రామయ్యా, గంగమ్మా ఊరు చేరుకున్నాక గంగమ్మ ఊరి న్యాయాధికారి దగ్గరకు వెళ్లి ఫిర్యాదుచేసింది. "ఎందుకు ఊరుకోవే!" అని మొగుడు అన్నా వినిపించుకోలేదు. "ఇదుగో, ఓయ్! నువ్వెప్పుడూ యింతే! ఊళ్ళోవాళ్ళంతా నీమీద పడినా చూస్తూ ఊరుకుంటావు," అన్నది గంగమ్మ.

న్యాయాధికారి గంగమ్మ, రామయ్యనూ, రామయ్య మీదపడిన బసవయ్య అనే వాణ్ణి పిలిపించాడు.

అందరు చెప్పినదీ విన్నమీదట న్యాయాధికారికూడా బసవయ్య బుద్ధిపూర్వకంగా తప్పుచేయలేదని నమ్మాడు. ఈసారికి బసవయ్యను క్షమించిపోనివ్వమని గంగమ్మకు హితవుచెప్పాడు. 'ఇదేనా మీరు చెప్పే న్యాయం? ఈ దుర్మారుడు మా మామిడి చెట్టులో దాక్కొని మా ఆయన చెట్టు కిందికి రావటంచూసి మీద దూకేస్తాడా? మీవల్ల కాకపోతే చెప్పండి. నేనింకో చోటుకి వెళ్లి న్యాయం రాబట్టుకుంటాను," అన్నది గంగమ్మ.

"సరే, అయితే, నీకు కావలసిన న్యాయం నేనే చెప్తాను! ఆ మామిడిచెట్టు నువ్వే ఎక్కు. బసవయ్య దానికిందికి రాగానే సూటిగా అతనిమీద దూకు!" అన్నాడు న్యాయాధికారి.

"నేను చెట్టెక్కనా? ఆ మనిషిమీద పడబోయి కిందపడితే? ఒకవేళ మనిషిమీదనే పడితేమాత్రం నాకు దెబ్బ తగలదూ?" అన్నది గంగమ్మ వెలా తెలాపోతూ.

"ఈ అనుమానాలన్నీ బసవయ్యకైనా ఉండవలసిందేగద! మరి బసవయ్య మాట నమ్మవేం?" అన్నాడు న్యాయాధికారి.

గంగమ్మ బుద్ధితెచ్చుకుని తిరిగిచూడకుండా భర్తతోసహా ఇంటికిపోయింది.





# తపఃఫలం

పూర్వకాలమందు రాజ్యవర్ధనుడు అనే మహారాజు ఉండేవాడు. ప్రజలకి అత నంటే ప్రాణంగా వుండేది. రాజు కూడా వారిని కన్నబిడ్డల్లాగా పరిపాలిస్తూవచ్చాడు.

ఒకనాడు భర్తకి తలంటుపోస్తూ రాణి కంట తడిపెట్టింది. అదిచూచి రాజు ఆమెను కారణం అడిగాడు. అందుకు రాణి "కారణం ఏమిటని చెప్పను—మీ తల వెంట్రుకలు నెరిసిపోతున్నాయి. ముసలి తనం పయిబడిందే అని దుఃఖం వచ్చింది" అన్నది కళ్ళనీళ్ళు తుడుచుకొంటూ.

ఇది విని రాజు: "ఇందుకోసమేనా నీ విచారం. ముసలితనం అందరికీ వస్తుంది. దానితోపాటు మరణంకూడా వెంటాడుతూ ఉంటుంది. ఇది సహజమేకద. ఇవాళ కాకపోతే రేపయినా చావవలసిన వాళ్ళమే కదా. అందుకోసం విచారించటం అనవసరం" అంటూ సముదాయించాడు.

కాని రాణికి విచారం తగ్గలేదు. తన భర్తకు ఆయుర్వృద్ధి కలిగించవలసిందంటూ, ఆమె ముక్కోటి దేవతలనూ ప్రార్థించసాగింది. భార్య విచారాన్ని చూసి రాజ్యవర్ధనుడుకూడా కుంగిపోసాగాడు. అతడు క్రమక్రమంగా రాజ్యవ్యవహారాలే పట్టించుకొనని దశకు దిగజారిపొయ్యాడు.

ఈ పరిస్థితులలో మంత్రి యేమిచేస్తే బావుంటుందా అని ఆలోచించాడు. వృద్ధాప్యంతోపాటు, మానసిక ఆరోగ్యాన్నికూడా కోల్పోతున్న రాజు, పక్కకు తప్పుకోవటమే రాజ్యానికి క్షేమం అనుకున్నాడు. రాజ్య భారాన్ని మోసేందుకు రాజ్యవర్ధనుడి పెద్ద కుమారుడు ఉండనేవున్నాడు. మంత్రి, రాజుతో ఉన్న పరిస్థితి దాపరికం లేకుండా మనవిచేసుకొన్నాడు.

సరే, రాజ్యవర్ధనుడు పెద్దకొడుకును రాజుగాచేసి, తాను తపస్సు చేసుకుందుకు

అడవులకు వెళ్ళిపోదామనుకున్నాడు. మరునాడే రాజు పురోహితుణ్ణి పిలిపించి, ముహూర్తం పెట్టమన్నాడు.

కాని, ప్రజలు ఊరుకోలేదు. మహారాజుతో: "ప్రభూ!—ఇన్నాళ్ళూ మమ్మల్ని కన్నబిడ్డలలాగా చూస్తూవచ్చారు. ఈనాడు మమ్మల్ని వదిలిపెట్టి పోతున్నారంటే మాకు విచారం కలుగుతోంది. మీరు ఇక్కడే ఉండిపొండి. మా మాట కాదుఅంటే మేముకూడా మీతోపాటు వస్తున్నాము" అన్నారు ఏకకంఠంగా.

అందుకు రాజు: "మానవుడికి పుట్టుకతోనే చావూ వున్నది. ఎవ్వరైనా చావక మానరు. నేను అడవులలోకి వెళ్ళక పోయినా నన్ను మరణం వెంటాడుతూనే ఉంటుంది. కనుక ఈ ముసలితనంలో నయినా తపస్సు చేసుకుంటూ కాలం గడుపుతాను. మీరేమీ భయపడకండి. మీకు మరో రాజుని నియమించే వెళుతున్నానుగదా" అన్నాడు.

అయినా ప్రజలు ఊరుకోలేదు. వాళ్ళల్లో ముఖ్యులు పుణ్యక్షేత్రాలకు వెళ్ళి తమ రాజుకు ఆయువు వృద్ధికావాలని తపస్సు చేయసాగారు. అలా వాళ్ళు నెలల తరబడి తమ రాజుకోసం తపస్సుచేశారు.




అప్పుడు వాళ్లకి ఒక గంధర్వుడు కనబడి, "మీరంతా ఆ ప్రత్యక్షదైవం సూర్యభగవానుణ్ణి గురించి కామరూప పర్వతంమీద తపస్సుచేయండి. ఆయనే మీ కోరిక తీరుస్తాడు" అని చెప్పి అదృశ్యమయ్యాడు.

అందుకు వాళ్లు సంతోషించి కామరూప పర్వతంమీదకు వెళ్ళారు. వెళ్ళి ఘోరంగా తపస్సు చేయసాగారు. కొంతకాలానికి సూర్యుడు ప్రత్యక్షమై, "మీ కోరికప్రకారం రాజ్యవర్ధనుడు ఇంకా వేయి సంవత్సరాలు జీవిస్తాడు" అని చెప్పి అదృశ్యమయ్యాడు.

తపస్సు ఫలించిందిగదా అని వాళ్ళు సంతోషించారు. మహారాజుతో ఈ సంగతి

చెప్పారు. కాని, రాజుకి సంతోషం కలగ లేదు. అదిచూచి రాణి: "నాథా!— ప్రజలు మీయందు గల భక్తివిశ్వాసాలతో సూర్యుణ్ణి ప్రార్థించి వరం సంపాదించుకు వచ్చారుకదా—ఇంకా మీకు విచారం ఎందుకు ?" అని అడిగింది.

అందుకు రాజు: "రాణీ!— నువ్వు చెప్పిన మాట బాగానే వుంది. నా ప్రజలు నాకోసం ఇంత కష్టపడి వరం పొంది వచ్చారు. సరే. నేను వేయి సంవత్సరాల కాలం జీవిస్తాను. కాని, నామీద విశ్వాసం గల ఈ ప్రజలు అంతకాలమూ జీవించరు కదా? నాతోపాటు నా ప్రజలుకూడా వేయి సంవత్సరాలు జీవించివుండకపోతే నాకు సంతోషం ఎక్కడిది?—కనుక, నేనుకూడా నా ప్రజలకు నేను ఉన్నంతకాలమూ ఆయుస్సు సంపాదించుకు వస్తాను" అని కామరూప పర్వతంమీదకు వెళ్ళి తను కూడా తపస్సు ప్రారంభించాడు.

ఒకటి రెండు సంవత్సరాలు గడిచినై. రాజ్యవ్యవహారాలు కుంటుపడినై. అయినా ప్రజలు నీతిపర్తనులుగనక దేశంలో అరాజకం ప్రబలలేదు. తమ రాజు చేస్తున్న తపస్సు ఎప్పటికి ఫలిస్తుందోగదా అని ప్రజలు ఆతురత చెందసాగారు. ప్రతి దినం వేలాదిమంది కామరూప పర్వతం దగ్గరకు వెళ్లి రాజదర్శనం చేసుకోసాగారు.

ఎట్టకేలకు సూర్యభగవానుడు, రాజ్యవర్ధనుడి దీక్షకు మెచ్చుకున్నాడు. అతనికి ప్రత్యక్షమై, "రాజా!—నీ సద్బుద్ధికి మెచ్చాను. నీ తపస్సు ఫలించింది. నీ కోరిక ప్రకారమే, నీవు జీవించినంతకాలమూ నీ ప్రజలుకూడా జీవిస్తారు." అని వరమిచ్చి అదృశ్యమయ్యాడు.

సూర్యభగవానుడి అనుగ్రహంవల్ల రాజ్యవర్ధనుడూ, అతని ప్రజలూ వేయి సంవత్సరాలూ జీవించి సర్వ సౌఖ్యాలు అనుభవిస్తూ సుఖంగా వున్నారు.





# మహాసాధ్వి

కొన్ని వేల సంవత్సరాలకిందట బ్రహ్మదత్తుడు కాశీరాజ్యాన్ని పాలించే కాలంలో, బోధిసత్త్వుడు సమీపంలోనే ఒక సంపన్న గృహస్థుని కుమారుడుగా జన్మించాడు.

బోధిసత్త్వుడు చిన్నతనంలోనే సమస్త విద్యలూ నేర్చాడు. యుక్తవయస్సు రాగానే, అతని తలిదండ్రులు కాశీనగరంలోనే ఒక సంబంధం చూచారు. సుజాత అనే ఒక కన్యను తెచ్చి బోధిసత్త్వుడికి పెళ్లి చేశారు. సుజాత సౌందర్యవతిమాత్రమే కాదు, సుగుణవతి, వివేకవతిన్ని. అటు భర్తకూ, అత్తమామలకూ కూడా పరిచర్యలు చేస్తూ, తలలో నాలుకగా మసులుకొనేది.

బోధిసత్త్వుడుకూడా ఆమెపైన ఎంతో అనురాగం చూపేవాడు. ఇలా ఆ ఇద్దరిదీ ఒక్క మాట, ఒక్క మనస్సు అయి, చూడ ముచ్చటగా ఉండేవారు.

కొంతకాలం గడచినతరువాత ఒకనాడు, సుజాత తన భర్తతో 'నాకు మా అమ్మనూ నాన్ననూ చూచిరావాలనివున్నది. వాళ్ళూ వృద్ధులయిపోయారు. మీరు తోడువస్తే యిద్దరం కలిసి వెళ్లి చూచివద్దాం!" అంటూ, తన కోరిక వెల్లడించింది.

ఇందుకు బోధిసత్త్వుడు చాలా సంతోషపడ్డాడు. 'అలాగే. తప్పకుండా వెళదాం. నాకూ అత్తామామల్ని చూడాలని చాలా కాలంగా కోర్కెవున్నది. యింతకీ యింటి దగ్గిర పనులతొందర్లో వూరుకున్నానుగాని లేకపోతే నేనే ముందు బయలుదేరదామనేవాణ్ణి" అన్నాడు. తరువాత ప్రయాణానికి అన్నీ సిద్ధంచేయమని చెప్పాడు.

అనుకొన్నట్టుగానే అంతా సిద్ధమయింది. సామానులన్నీ బండిలో సర్దుకొన్నారు. బండిలోపల సుజాత కూర్చుంది. తొట్టిలో బోధిసత్త్వుడు కూర్చొని బండీ తోలుతూ

వున్నాడు. కాశీనగరం పొలిమేరకు చేరుకొన్నారు వాళ్లు. ఒక చెట్టుకింద బండి విప్పి, కాళ్ళూ చేతులూ కడుక్కొని వెంటతెచ్చుకొన్న ఆహారపదార్థాలు భుజించారు. కొంచెంసేపు విశ్రాంతి తరువాత మళ్ళీ బండి పూన్చి, నగరంలోకి బయలుదేరారు.

సరీగా బోధిసత్వుడి బండి నగరం ప్రవేశించే సమయాన, కాశీరాజు ఏనుగు అంబారీ ఎక్కి నగరంలో ఊరేగుతున్నాడు. ఆ ఉత్సవం చూచే వేడుకతో, సుజాత భర్త అనుమతితో బండిదిగి కాలినడకని ముందు నడుస్తున్నది. బోధిసత్వుడు వెనక బండి తోలుకు వస్తున్నాడు.

అంబారీపైన వున్న కాశీరాజు ఆకస్మికంగా అతిరూపసౌందర్యవతి ఐన సుజాతను చూచాడు. ఆమెను పెళ్ళాడదామని రాజుకు బుద్ధిపుట్టింది. ఆమెనుగురించి ఛోగటాచేయగా, ఆమె ఫలానావారి అమ్మాయి అనీ, ఆ బండిలో కూరున్న అతనే ఆమె భర్త అనీ తెలియవచ్చింది.

అప్పుడు రాజుకు ఒక దురాలోచన కలిగింది—ఎలా అయినా ఆ పురుషుడి పీడ వదుల్చుకొని, సుజాతను తన రాణిగా చేసుకొందామని నిశ్చయించుకొన్నాడు. ఇందుకోసం అతడు బాగా ఆలోచించి తిరుగులేని ఒక వ్యూహం పన్నాడు.



తనకు నమ్మకమున్న ఒక భటుని పిలిచి, 'అలా వెళ్ళినట్టే వెళుతూ, దీనిని ఆ బండిలో పడవేసిరా' అని చెప్పి, తన బంగారు కిరీటం వాడికి ఇచ్చాడు. భటుడు బోధిసత్త్వుడు చూడకుండా బండిలో కిరీటం పడవేసి, ఆ సంగతి రాజుతో చెప్పాడు.

వెంటనే 'రాజావారి కిరీటం పోయిం' దంటే 'పోయింది!' అని పెద్దగోల ప్రారంభ మయింది. నగరమంతా అల్లకల్లోలంగా వుంది. ఎక్కడివాళ్ళను అక్కడే నిలిపి వేసి, సోదా చేయమని రాజాజ్ఞ అయింది. ఒకడు వెళ్ళి బోధిసత్త్వుణ్ణి 'బండీ ఆపు' అని అటకాయించాడు. బండిలోపల వున్న రాజకిరీటం తీసి, 'వీడే దొంగ!!' అంటూ, ఆ భటుడు బోధిసత్త్వుణ్ణి రాజు యెదుటకు తీసుకవచ్చి నిలబెట్టాడు.

కాశీరాజు ఉగ్రుడై, విచారణ చేయకుండానే "వీడా? పరమ దుర్మార్గుడు! తల తీసివేయండి' అని ఆజ్ఞాపించాడు. తన వ్యూహం సాగినందుకు ఆ దుష్ట భూపతి ఎంతగానో సంతోషించాడు. రాజాజ్ఞ ననుసరించి భటులు బోధిసత్త్వుణ్ణి కొరడాలతో కొట్టి, వీధులన్నీ తిప్పి అవమానించారు. తల నరికేందుకు నగరం వెలుపలవున్న బలిపీఠంవద్దకు తీసుకుపోయారు.




బండి వదిలేసి సుజాత, గోలపెట్టుకొంటూ బోధిసత్త్వుడి వెంబడి పోసాగింది. "అయ్యో, మీకు ఈ కీడు అంతా నావల్లనే కదా కలిగింది!" అంటూ తీరని దుఃఖంలో మునిగిపోయింది. తల కొట్టివేయడానికని తలారులు బోధిసత్త్వుని బోరగిలా పడుకో బెట్టారు. అప్పుడు సుజాత ఆవేదనతో—

'అమాయికులను రక్షించగల దేవుడే లేడా?... దుష్టుల దుండగాలకు అడ్డు లేదా...?' అంటూ విలపించింది.

మహాసాధ్వి అయిన సుజాత ఈ విధంగా విలపించేసరికల్లా స్వర్గలోకంలో దేవేంద్రుని సింహాసనం వడవడ వణకసాగింది.

'ఇదేమిటి చెప్మా' అని దేవేంద్రుడు ఆశ్చర్యపోయి, దివ్యదృష్టితో చూచాడు. సంగతిఅంతా గ్రహించి, ఒకచిత్రం చేశాడు. రాజు స్థానంలో బోధిసత్త్వుడూ, బోధిసత్త్వుడు ఉండేచోటున రాజూ ఉండేటట్టు తన మహిమవల్ల వారిద్దరి స్థానాలూ మార్చివేశాడు. ఇది అక్కడ మూగిన పైవాళ్లకెవళ్ళకూ తెలియనే తెలియదు.

ఏనుగపైన ఉన్నవాడు రాజే అనుకొన్నారు జనులు. కాని, నిజానికి ఆయన రాజుకాదు. రాజుదుస్తులు ధరించుకొనివున్న బోధిసత్త్వుడు. తలారుల వశంలో బలిపీఠంమీద వున్న బోధిసత్త్వుడు నిజంగా బోధిసత్త్వుడు కాడు—ఆతని దుస్తులు ధరించివున్న రాజు!

ఈ రహస్యం తెలియని తలారులు తమ అధీనంలోవున్న మనిషిని రాజాజ్ఞప్రకారం పీక తెగవేశారు. ప్రాణంపోగానే దుర్మార్గుడైన కాశీరాజుకు అతడి నిజస్వరూపం వచ్చింది. అప్పుడు ఆ చంపబడినవాడు రాజే అని ప్రజలకందరికీ తెలిసిపోయింది. వాళ్ళల్లో కలకలం బయలుదేరింది. ఇంత విచిత్రసంఘటనకూ కారణం ఎవరా అని వాళ్ళు ఆశ్చర్యపడసాగారు.

అప్పుడు దేవేంద్రుడు బోధిసత్త్వుడికీ, ప్రజలకూ కనబడ్డాడు. అక్కడివారికి సంగతి సందర్భాలన్నీ వెల్లడించి, ఇటుపైన 'ఈ బోధిసత్త్వుడే మీకు ప్రభువు. సుజాత మీ పట్టపు రాణి' అని చెప్పి అంతర్హితుడయ్యాడు. పాపం పండి, దుర్మార్గుడైన రాజు మరణించినందుకు రాజ్యంలో ప్రజలందరూ సంతోషించారు. దేవేంద్రుని మాటలప్రకారం బోధిసత్త్వుణ్ణి రాజుగానూ సుజాతను రాణిగానూ సమ్మతించారు.

నాటినుంచీ కాశీరాజ్యంలో ధర్మం నాలుగుపాదాలా నడిచింది. నెలకు మూడు వర్షాలూ కురుస్తూ దేశం సుభిక్షంగా ఉంటూవచ్చింది.





# అహంకారం

చాలాకాలం కిందట కుముదుడనే మహర్షి విష్ణువునుగూర్చి ఘోరతపస్సు చేశాడు. కొంతకాలానికి విష్ణువు లక్ష్మీసమేతుడై ఆయనకు ప్రత్యక్షమయాడు. సాష్టాంగ నమస్కారంచేసి, చేతులు జోడించి నిలబడిన కుముదుడిని ఏమి వరం కావాలో కోరుకోమన్నాడు మహావిష్ణువు.

ఏ కోరికలూ లేకుండా, కేవలం విష్ణుదర్శనంకోసమే కుముదుడు తపస్సు ప్రారంభించాడు. అలాంటి స్థితిలో విష్ణువు వరం కోరుకో మనేసరికి అతడు తికమకపడ్డాడు.

లక్ష్మీదేవి కుముదుడి మనస్థితిని గ్రహించినదై యిలా అన్నది: "వత్సా, నీ భక్తికి మెచ్చాము. అనాలోచితంగా యిప్పుడే ఏదో వరము కోరుకోనవసరంలేదు. మేము మళ్లీ మాసం రోజుల్లో నీకు దర్శనంయిస్తాము. యీ గడువులో బాగా ఆలోచించి నీకు కావలసిన వరం ఏదో కోరుకోవచ్చు!"

లక్ష్మీదేవి యిలా అనేసరికి కుముదుడు స్థిరచిత్తుడయ్యాడు. మరుక్షణంలోనే మహావిష్ణువు లక్ష్మీసమేతంగా అదృశ్యుడయ్యాడు.

కుముదుడు తన తపస్సు ఫలించింది గదా అని మహదానందం పొందాడు. తరవాత తన ఆశ్రమానికి తిరిగివచ్చి శిష్యులకు యీ శుభవర్తమానం తెలిపాడు.

గురువుగారి అమోఘ తపశ్శక్తికి శిష్యులంతా అబ్బురపడ్డారు. సాక్షాత్తు ఆ మహావిష్ణువే ప్రత్యక్షమై వరం కోరుకోమన్నా కోరుకోని ఆయన త్యాగాన్ని వేనోళ్ళ ప్రస్తుతించారు. యీ పదునాలుగు భువనాల్లో యింత సర్వసంగ పరిత్యాగి, మహాభక్తుడు



లేదని పొగడసాగారు. యీ పొగడ్తలతో కుముదుడిలో అహంభావం ఏర్పడింది. తనకంటే మహర్షిశ్రేష్ఠుడు ఎక్కడా లేడని భావించసాగాడు.

యీ స్థితిలో కుముదుడు ఒకనాడు గంగానదికి శిష్యులతో కలిసి స్నానానికి వెళ్లాడు. అక్కడ వీళ్ళకు నదిలో స్నానం చేసి వస్తూన్న రైవతుడు అన్న రాజర్షి ఎదురైయ్యాడు. భార్యా, పదిమంది పిల్లలూ-ఈయనేమి ఋషి అన్న సంశయం కలిగింది కుముదుడి శిష్యులకు. సంశయ నివృత్తికై వాళ్ళు గురువును ప్రశ్నించారు. అందుకు కుముదుడు:

"యీ రైవతుడు ఋషినామానికి ఎలా అర్హుడో నాకు తెలియటంలేదు. సర్వసంగ పరిత్యాగం చేసి, ఆకు అలములు తింటూ అడవుల్లో తపస్సుచేసేవాళ్లకే దైవదర్శనం దుర్లభంగదా?" అన్నాడు యీసడింపుగా.

అలా అన్నాడేకాని కుముదుడికి తన జవాబు తనకే సంతృప్తికరంగా లేదు. సరే విష్ణుమూర్తి యిక కొద్దిదినాల్లో ప్రత్యక్షమవుతాడుగదా ఆయననే అడిగి సంశయ నివారణ చేసుకుందాం అనుకున్నాడు.

నెలరోజులు జరిగిపోయేసరికి విష్ణుమూర్తి లక్ష్మిసమేతుడై తిరుగా కుముదుడికి ప్రత్యక్షమయ్యాడు. వరాలుకోరే సంగతి మరిచిపోయిన కుముదుడు, రైవతరాజర్షిని గురించిన తన సంశయం తీర్చవసిందని విష్ణుమూర్తిని అడిగాడు.

అందుకు మహావిష్ణువు నవ్వి: "కుముదా! నాకు భక్తి ప్రధానం. మనస్సు నిర్మలం కానప్పుడు సన్యాసం స్వీకరిస్తే మాత్రం ఏముంది? అయినా నీకు పూర్తిగా సంశయ నివృత్తి కావాలంటే శ్రీశైలందగ్గిర వున్న స్వర్ణాగ్రహారానికి వెళ్లు. అక్కడ సుధర్ముడు అనే ఆయనవల్ల సంశయ నివృత్తి కలుగుతుంది!" అనిచెప్పి అంతర్ధానమయాడు. తరవాత కుముదుడు తన శిష్యబృందంతో

శ్రీశైలానికి బయలుదేరాడు. కొన్ని రోజుల ప్రయాణానంతరం అక్కడికి చేరాడు. ఒక నాటి ఉదయం శిష్యులు వెంటరా పాతాళ గంగలో స్నానానికి వెళ్ళాడు. అందరూ స్నానాలు చేస్తున్నంతలో ఒక మొసలి వచ్చి కుముదుడి కాలు పట్టుకున్నది.

గురువుగారిని మొసలి పట్టుకోవటం చూసిన శిష్యులు భయకంపితులై కేకలు వేయసాగారు. కాని కుముదుడు నిర్భయంగా దానికేసి తీవ్రదృక్కులతో చూచాడు. అతని తపోశక్తివల్ల మరుక్షణమే మొసలి గిలగిల కొట్టుకుని ప్రాణాలు విడిచింది. యీ సంఘటనతో కుముదుడిలోని అహంభావం మరికాస్త వృద్ధి అయింది.

ఒకటి రెండు రోజుల తరవాత కుముదుడు స్వర్ణాగ్రహారానికి వెళ్ళాడు. తీరా ఆయన అక్కడికి వెళ్ళేసరికి సుధర్ముడు యింటలేడు. సుధర్ముడి భార్య ఆ సమయంలో తలుపుపక్కనే కూర్చుని ఒక పాత చీర చిరుగులు కుట్టుకుంటోంది. కుముదుడిని చూచి, భర్త వచ్చేవరకు ఆ బైట అరుగుమీద కూర్చోవలసిందిగా చెప్పింది.

తనవంటి గొప్ప ఋషికి తగిన మర్యాద జరగలేదని కుముదుడికి చాలా కోపం వచ్చింది. తలుపుచాటున కూర్చునివున్న




సుధర్ముడి భార్యకేసి తీవ్రదృక్కులతో చూచాడు. కాని మొసలిలాగా ఆమె గిలగిల తన్నుకుని కింద పడిపోలేదు.

దీనితో కుముదుడికి తన తపోశక్తిమీద కొంత అపనమ్మకం ఏర్పడింది. అంతలో సుధర్ముడు అక్కడికి వచ్చి—అతిథులనందరినీ గృహంలోకి ఆహ్వానించాడు. కాసేపటికల్లా వంట సిద్ధంచేసి అందరికీ భోజనం వడ్డించింది సుధర్ముడి భార్య.

కుముదుడు విస్తరిముందు కూర్చున్నాడు. వంటకాలు ఏ కారణంచేతనో చాలా చల్లగావున్నాయి. కుముదుడికి చాలా కోపం వచ్చింది. అతడు హేళనగా—

"సుధర్మా! వంటకాలన్నీ తగని వేడి మిగా ఉన్నాయి!" అన్నాడు.

సుధర్ముడు, కుముదుడి హేళనను గ్రహించాడు: "స్వామీ, అయితే ఈ విసన కర్రతో విసురుతాను!" అంటూ చేతనున్న విసనకర్రతో విసరసాగాడు.

నిమిషంలో కుముదుడి విస్తటిలోని పదార్థాలన్నీ వేడెక్కి పొగలు విడవసాగినై. కుముదుడు ఆశ్చర్యపోయాడు.

చెయి కడుగుకునేందుకు బావిదగ్గరకు వెళ్తే అక్కడ మరో వింత దృశ్యం కుముదుడిని కలవరపెట్టింది. బావి గిలకమీద సగంలాగి వదిలిన చేంతాడూ, బావిలో వేలాడుతూవున్న నిండు బొక్కెనా అతడి కంటబడినై.

"నీళ్ళు చేదుతూ చేదుతూవుండగా, మావారు పిలిస్తే చేద అక్కడే వదిలి వెళ్ళాను." అంటూ సుధర్ముడి భార్య నవ్వుతూ కుముదుడితో చెప్పింది.

తనకంటె గొప్ప తపశ్శాలి లేడనీ, సంసార కూపంలో పడివున్నవాళ్ళు అల్పులనీ భావించే కుముదుడికి గర్వభంగమయింది.

అతడు చేతులు జోడించి సుధర్ముడికి నమస్కరిస్తూ: "సుధర్మా, మీరు మహనీయులు! సర్వసంగపరిత్యాగులై తపస్సు చేయనివారికూడా మోక్షం వుంటుందా?" అని అడిగాడు.

అందుకు సుధర్ముడు: "కుముదా! నిర్మలమైన మనస్సుతో దేవుడిని ఎక్కడ వుండి ప్రార్థించినా ముక్తి లభ్యమవుతుంది. అడవులలో కందమూలాలు తింటూ, ముక్కు మూసుకు కూర్చున్నా—నిర్మలమైన మనస్సులేని అహంకారికి మోక్షద్వారం తెరవబడదు!" అని చెప్పాడు.

ఈవిధంగా కుముదుడికి సంశయనివృత్తి కలగటమేగాక, అహంకారంకూడా నశించింది. ఆనాటినుంచి నిర్మల చిత్తంతో భగవధ్యానంచేసి ముక్తిపొందాడు.






## 8

[అడవిలో దారి వెతుక్కుంటూ పోతూన్న సమరసేనుడికీ, సైనికులకూ, ప్రాణాపాయ స్థితిలోవున్న ఒక కొత్త సైనికుడు కనబడ్డాడుగదా? అతడివల్ల కుండలినీ ద్వీపాన్నించి వచ్చిన కుంభాండుడి రాజద్రోహాన్ని వాళ్ళు తెలుసుకున్నారు. అతణ్ణి హతమార్చటం ఎలాగా అని ఆలోచిస్తున్న సమరసేనుడికి చతుర్నేత్రుడు తారసపడ్డాడు. తరువాత—]

చతుర్నేత్రుడు హఠాత్తుగా తమముందు ప్రత్యక్షమయేసరికి సమరసేనుడికీ, సైనికులకూ గుండెలు అవిసిపోయినై. ఆ కొత్త సైనికుడు మరీ హడలిపోతున్నాడు. చతుర్నేత్రుడి వేగులైన నల్లగూబా, నరవానరమూ ఆ దాపులనే నిలబడి ఈ వింత చూస్తున్నయి.

"పరులకు హాని గలిగించటం నాపని కాదు. భయపడకండి!" అన్నాడు చతుర్నేత్రుడు నవ్వుతూ. "ఆ ఏకాకి తప్ప ఈ లోకంలో నా కెవరూ శత్రువులు లేరు. అతగాడినైనా, నన్ను హతమార్చాలని పూనుకున్నాడు గనకనే నేను శత్రువుగా భావించవలసి వచ్చింది. ఇంతకీ ఈ కొత్తవాడెవడు?" అన్నాడు చతుర్నేత్రుడు అపాయంనుంచి రక్షింపబడిన సైనికుడికేసి వేలుచూపుతూ.

"నా పేరు ధనపాలుడు. ఆపదలో వున్న నన్ను వీళ్లు రక్షించారు" అన్నాడు ధనపాలుడు భయంభయంగా. ఆమాటలకు చతుర్నేత్రుడు నవ్వి—

"ఇప్పుడు మీరంతా ఆపదలోనే చిక్కుకోబోతున్నారు. లోగడ మీకు హాని తలపెట్టిన






దానినుంచి బయటపడే మార్గం తెలియ చేయరా ?'' అని అడిగాడు దీనంగా.

చతుర్నేత్రుడు వెంటనే ఏ జవాబూ ఇవ్వలేదు. కొంచెంసేపు ఆలోచించి తల పంకిస్తూ ఇలా అన్నాడు—

"ఈ ద్వీపంలో ఇన్ని యిక్కట్లకూ మూలకారణం ఆ పడమటి సముద్ర తీరంలో సగం మునిగివున్న ఒకానొక ఓడ. దాని నిండుగా ధనరాసులున్నాయని అందరికీ తెలిసిందే. ధనంతో కాని పని అంటూ ఏమీ ఉండదనికూడా చాలామంది నమ్మకం. ఏకాక్షిమాంత్రికుడికి ఆ ధనం కావాలి, నాకు ఆ నావని కాపలాకాస్తున్న నాగకన్య కావాలి. మీకు ఏంకావాలో చెపితే నా చేత నైన సహాయం చేస్తాను.''

అంతలో ప్రాణాపాయంనుంచి రక్షింపబడిన ధనపాలుడు వణికిపోతూ పెద్ద కేక పెట్టాడు. సమరసేనుడూ, తక్కిన సైనికులూ అతడికేసి తిరిగి, "ఏమిటి? ఏం జరిగింది ?'' అంటూ ఆత్రంతో అడిగారు.

ధనపాలుడు దూరంగా వున్న పొదలకేసి వేలు చూపుతూ—"చూడండి, చూడండి! వాళ్ళు మళ్లీ తిరిగివచ్చారు. నన్ను ఆ చెట్టుకు బంధించింది వాళ్లే!'' అని కలవరపాటుతో అరవసాగాడు.

వాడెవడైనావుంటే—వాడు ఆ ఒక్క ఏకాక్షి మాంత్రికుడే. ఇక యిప్పుడు ఈ ద్వీపానికి దక్షిణపుకొండల అవతల్నించి మీలాంటి మనుషులవల్లనే మీకు ప్రాణాపాయం కలగబోతోంది'' అన్నాడు.

ఆ సమయంలో పొదలమాటున దాగిన యిద్దరు అటవికులు వీళ్లకేసి చూస్తున్నారు. కాని, పాపం ఆ సంగతి సమరసేనుడికి గానీ, సైనికులకిగానీ తెలియదు.

ఇక సమరసేనుడు "చతుర్నేత్రా! మీరు మాంత్రికులైనా మంచివారులా కనబడుతున్నారు. మీరు చెప్పినట్టు నిజంగానే మాకు ప్రాణాపాయం కలగబోతూంటే,





సమరసేనుడికీ, సైనికులకూ ఆ పొదల చాటునుండి పొంచిచూస్తున్న ఇద్దరు అడవిమనుషులు కనిపించారు. వెంటనే సమరసేనుడు బాణం ఎక్కుపెట్టాడు. కాని, చతుర్నేత్రుడు అతణ్ణి వారిస్తూ—

"సమరసేనా! నీ బాణం దెబ్బకు వాళ్ళు అందరు. ఆకాశంలో ఎగిరే గరుడ పక్షినీ, పరిగెత్తే చిరుతపులినైనా నీవు హత మార్చవచ్చు; వీళ్ళుమాత్రం నీ బాణవేగాన్ని మించి పరిగెత్తగలరు. వాళ్ళసంగతి నేను చూస్తాను!" అన్నాడు.

అలా అని "నరవానరా, ఉలూకా!" అంటూ చతుర్నేత్రుడు కేకవేశాడు. ఆ దాపులోనే వున్న నల్లగూబా, నరవానరమూ తమ యజమాని కేకవిన ఒక్క దూకున అతడిదగ్గరకు వచ్చి వాలినై.

"నరవానరా! నువ్వు ఆ పొంచిచూసి పారిపోతూన్న ఆటవికుల్ని హతమార్చు! ఉలూకా! నువ్వు ఈ చుట్టుపక్కల అంతా ఒక్కసారి వేగుచూసిరావాలి!" అని అజ్ఞాపించాడు చతుర్నేత్రుడు.

వెంటనే నరవానరం పరుగుచ్చుకుంది. కాసేపటిలోనే ఆ పొంచిచూసి పారిపోతూన్న ఆటవికుల్లో ఒకణ్ణి తన బలమైన చేతుల మధ్య చిక్కించుకున్నది.





ఆటవికుడు భయంతో అడవిఅంతా మార్మోగేలా అరుస్తున్నాడు. నరవానరం వాణ్ణి గాలిలో రెండు మూడుసార్లు తిప్పి పైకి ఎగరవేసింది. వాడు అరుస్తూ దూరంగా వున్న బండలమీద పడిపోయాడు.

పారిపోతూన్న రెండవ ఆటవికుడిమీదికి ఎగిరింది నల్లగూబ. అది తన కాళ్ళతో ముక్కుతో వాడి తలమీద పొడుస్తూ అరవ సాగింది. చిత్రమైన ఈ పోరాటం చూస్తున్న అందరూ పరమానందం పొందుతున్నారు.

అంతలో ధనపాలుడు తల పంకిస్తూ— "దాహం అవుతోంది. ఇక్కడ ఎక్కడైనా మంచినీళ్లు దొరుకుతాయా?" అని సైనికుణ్ణి అడిగాడు. ఆ మాట విన్న చతుర్నేత్రుడు- "తొందరపడి దాహం తీర్చుకునేందుకు పోతే ప్రాణమే పోవొచ్చు. ఇదీ ఈ ద్వీపం లోని పరిస్థితి. నావెంట రండి. మీకు మంచి నీళ్ళ కొలను చూపిస్తాను" అన్నాడు.

అందరూ నడిచి కొలనుదగ్గరకు పోయారు. ఆ కొలను నిండా ఖడ్గమృగాలు తదితర క్రూరజంతువులూ ఈదులాడు తున్నాయి. ధనపాలుడు జాగ్రత్తగా ఒడ్డునే ఉండి దాహం తీర్చుకున్నాడు.

సమరసేనుడు కుంభాండుణ్ణి గురించి ధనపాలుడు చెప్పిన సంగతి ఆలో చిస్తున్నాడు. ద్వీపానికి దక్షిణాన వున్న కొండల అవతల్నించి బయలుదేరివస్తున్న వాళ్లు ఎవరై ఉంటారా అన్న అనుమానం అతడికి కలిగింది. కాని క్షణంలో వాళ్ళెవ రైందీ అతడు గ్రహించేశాడు. వాడు తప్పక కుంభాండుడై వుంటాడనీ, ఆటవికులను వెంటవేసుకొని ఆ ధనరాసులతో నిండివున్న నావకోసం బయలుదేరివుంటాడనీ అర్థమై పోయింది సమరసేనుడికి.

"చతుర్నేత్రా! ఇంతకీ ఆ ధనరాసు లతోవున్న నావను కాపలా కాస్తూ ఒక నాగ కన్య ఉన్నమాట నిజమా, అబద్ధమా?" అని అడిగాడు సమరసేనుడు.



"ఇందులో అబద్ధం ఏమీలేదు. కావా లంటే నావెంట రండి. కాస్తదూరం నడిస్తే ఆ నావనూ, నాగకన్యనూకూడా చూపించ గలను!" అన్నాడు చతుర్నేత్రుడు.

ముందుగా చతుర్నేత్రుడు దారితీశాడు. అతడి వెనక సమరసేనుడూ, సైనికులూ నడిచారు. కొద్దిసేపట్లో వాళ్ళు ఎత్తైన ఒక ప్రదేశం చేరారు. అది ఒకకొండ కొనలాగా ఉంది. అక్కణ్ణించి చూస్తే ప్రశాంతమైన సముద్రం కనబడుతోంది.

"అడిగో, నావ కనబడుతోందా?" అని చతుర్నేత్రుడు తన చూపుడువేలితో సముద్రంకేసి చూపుతూ సమరసేనుడిని అడిగాడు. సమరసేనుడూ, సైనికులూ అటుకేసి చూశారు. వారికి నావ స్పష్టంగా కనబడుతోంది. అది సముద్రంలో సగం మునిగిపోయినట్టుగామాత్రం వుంది. చిరిగి పోయిన తెరచాపలతో ఒకపక్కకు ఒరిగి అలలతోపాటు అదీ తేలియాడుతోంది. కాని కాపలాకాస్తూన్న నాగకన్యమాత్రం వాళ్ల దృష్టికి గోచరించలేదు.

"నాగకన్య కనబడదేం?" అంటూ ఆశ్చర్యంగా సమరసేనుడు చతుర్నేత్రుణ్ణి ప్రశ్నించాడు. ఆ ప్రశ్నకు చతుర్నేత్రుడు చిరునవ్వు నవ్వి—



"సమరసేనా, ఆ నాగకన్యకూడా నీ కళ్ళకు గోచరిస్తే ఇక మా మంత్ర తంత్రాలు గడ్డిపోచకు కొరగావు. ఆ నాగ కన్యను నేనూ, ఆ ఏకాకీ మాత్రమే చూడ గలం. ఏకాకి ధనంమీది ఆశతో ఆమెమీద పగబట్టివున్నాడు, నేనేమో ఆమెను వరించి వున్నాను" అన్నాడు.

సమరసేనుడికి తరవాత ఏమి అడి గేందుకూ పాలుపోలేదు. మునుపు తను ఆ ధనరాసుల సంగతి విన్నప్పుడు వాటిని వశపరుచుకుని కుండలినీద్వీపం చేర్చాలను కున్నాడు. కాని అది తనవల్ల సాధ్యం కావని తెలుస్తూనేవుంది. పైగా యిప్పుడు





రాజద్రోహి కుంభాండుడుకూడా వాటికోసమే ప్రయత్నిస్తున్నాడు..తోడుగా ఏకాక్షిమాంత్రికుని బెడద వుండనేవుంది. అన్నిటికన్న, ఏ మంత్రశక్తి సహాయంలేకుండా ఆ నాగకన్య కాపలానుండి తప్పించుకుని ఆ నావను చేరటం అసంభవం!

సమరసేనుడు ఇలా ఆలోచిస్తున్నంతలో అది గ్రహించినవాడిలా చతుర్నేత్రుడు బిగ్గరగా నవ్వాడు.

"సమరసేనా! నీ ఊహలు నాకు తెలుస్తూనేవున్నాయి!" అన్నాడు చతుర్నేత్రుడు. "నాకూ ఈ క్షణంలో ఒక ఆలోచన కలిగింది. నీవేమో ఆ నావలోని ధనరాసులమీద ఒకకన్ను వేసేవుంచావని నేనెప్పుడో గ్రహించాను. ఆ ధనం విషయంలో మాత్రం నేను నీకు పోటీవాడిని కాను. నీ పోటీదారు ఆ ఏకాక్షిగాడే! కనుక మనం యిద్దరం కలిస్తే ఏమైనా సాధించగలమా అని నాఆలోచన!"

చతుర్నేత్రుడీ మాటలు ముగించేసరికి, సమరసేనుడికి ఎక్కడలేని ధైర్యమూ వచ్చింది. ఈ భయంకర ద్వీపంనుంచి ప్రాణాలతో బయటపడాలనుకుంటున్న అతడికి ఒక కొత్త ఆశ కలిగింది. రాజద్రోహి అయిన కుంభాండుణ్ణి హతమార్చాలి. వీలయితే ఆ నావలోని ధనరాసుల్నికూడా సంపాయించాలి. కాని... ఆ ధనరాసులతో నావ సముద్రంలో ఏ కారణంచేత అలా ఘండిపోయినట్టు? ..

సమరసేనుడికి ఈ రహస్యం తెలుసుకోవాలని ఉబలాటం కలిగింది.

'చతుర్నేత్రా! మాంత్రికులంటే సహజంగా ఏ మానవ ప్రాణిఅయినా భయపడక తప్పదు. కాని ఈ ద్వీపంలో వున్న మీకూ, ఏకాక్షిమాంత్రికుడికీ మధ్య ఎంతో వ్యత్యాసం వుంది. మీరు భూతదయ, సాధుపరాయణత్వం కలవాళ్లలా కనబడతారు. నేను చేయగలిగిన సహాయం ఏమైనావుంటే



చేస్తాను. కాని...ఒకటి, ఆ ధనరాసులతో నిండిన నావనుగురించిన రహస్యం తెలుసుకోవాలని వుంది!" అని అడిగాడు సమరసేనుడు.

అందుకు చతుర్నేత్రుడు వెంటనే జవాబివ్వక కాసేపు తటపటాయించాడు.

"ఆ నావా, ధనరాసులూ, ఆ నాగకన్య కథ అంతా చెప్పాలంటే చాలావుంది. అంతా వినేందుకు నీకు కుతూహలంకూడా లేకపోవచ్చు. కొద్దిలో చెపుతాను—

"బహుశా నీవు శమనద్వీపం సంగతి విని వుండవు. ఒకవేళ వినివున్నా మీరు పిలిచే పేరు మరొకటి కావొచ్చు. ఇక... ఆ శమనద్వీపాన్ని శాక్తేయుడు అన్న రాజు పాలిస్తూండేవాడు. శాక్తేయుడంటేనే నీకు తెలిసివుండాలి...అయన చండికా భక్తుడు. మంత్ర తంత్ర విద్యల్లో అతడికి అతడే సాటి.

ఒకసారి దేవీ నవరాత్రి వుత్సవాలు జరుగుతున్నాయి. శాక్తేయుడే స్వయంగా పూజ చేస్తున్నాడు. ఉన్నట్టుండి జన కోలాహలంమధ్యలో చండి పలికింది.

"భక్తులారా, మీ భక్తికి మెచ్చాను. కాని వట్టిపూజలతో నాకు తృప్తిలేదు. నాకు ఒక చక్కని దేవాలయం కట్టండి!" అంటూ హుంకరించింది చండీదేవి.

"తల్లీ, నీకు గొప్ప దేవాలయం కట్టాను. ఆకాశాన్నంటే గొప్ప గోపురం కట్టిస్తాను!" అన్నాడు శాక్తేయుడు మోకరిల్లి. కాని చండీదేవి మళ్లీ ఇలా పలికింది—

"నా గుడీ, గోపురాలు మామూలు రాతితో, మట్టితో కడితే నాకు తృప్తి కలగదు. వెండీ, బంగారాలతో కట్టించు, అప్పుడే నాకు తృప్తి!"

శాక్తేయుడు వణికిపోయాడు. దేవి ఆజ్ఞను శిరసావహించవలసిందేగదా? పెద్ద గుడి గోపురాలకు సరిపోయే వెండీ, బంగారాన్ని సంపాయించటం ఎలా?

—(ఇంకా వుంది)






ఒక అడవిప్రాంతాన గల చిన్న పల్లెలో ఒక కాపుయువకుడు ఉండేవాడు. అతడు చిన్నప్పటినించీ వ్యవసాయపు పనులు చేస్తూండేవాడు. కాని కొంతకాలం అయేసరికి వ్యవసాయం అంటే అతడికి విసువు పుట్టింది. బాణం అంబులూ చేతబట్టితే అడవిలోని ఏ జంతువునైనా చంపి పొట్ట నింపుకోవచ్చుగదా—అన్న దురాలోచన కలిగింది.

ఇక అప్పటినుంచీ విల్లంబులు చేతబూని అడవిలో కనబడిన జంతువులనూ, పక్షులనూ చంపసాగాడు. లేళ్ళూ, నెమళ్ళ లాంటి అందమైన సాధుప్రాణులన్నీ అతడి బాణాలకు గురికాసాగినై.

ఒకనాడు యిలాగే వేటాడుతూండగా పెద్ద గాలీవానా వచ్చింది. కాపుయువకుడు ఆ దాపులనే వున్న ఒక పూరిగుడిసెలో తలదాచుకున్నాడు. కొంతసేపటికి ఆ పక్కనే వున్న మరివొక పూరిపాకలో సందడి కాగా అతడు లేచి గుడిసెలోంచి బయటికి వచ్చి ఆ వైపు వెళ్ళాడు.

కాపుయువకుడికి భలే ఆశ్చర్యం కలిగింది. ఆ పాకలో ముగ్గురు చిత్రమైన వింతమనుష్యులు కనిపించారు. వాళ్ళు ముగ్గురూ పొట్టివాళ్ళు. వాళ్ళు కాళ్ళవరకూ వేలాడే పొడవాటి అంగీలు ధరించారు. టోపీలు పెట్టుకొనివున్నారు. వాళ్ళు పొయ్యిలో కట్టెలుపెట్టి మంటచేస్తున్నారు.

ఆశ్చర్యపడుతూ ఇంకా పరిశీలనగా చూచాడు కాపుయువకుడు. మూడు బంగారుపాత్రలు అక్కడ పెట్టి, వాళ్ళేదో వంటచేస్తున్నట్టు గ్రహించాడు. వాళ్ళ ముగ్గురిలో ఒకడు అక్కడ వున్న బానలో పాలు పోస్తున్నాడు. ఒకడు కలియ తిప్పుతున్నాడు. మరిఒకడు పొయ్యి ఎగసంతోస్తున్నాడు. దీనినిబట్టి వాళ్ళు ఏదో

ఎస్. ఈశ్వరబాబు




తియ్యని పదార్థం తయారుచేస్తున్నట్టు యువకుడు ఊహించాడు.

అంతా తయారయ్యాక, ముగ్గురిలో ఒకడు ఒక వెండిబూరా తీసుకున్నాడు. అది ఆ పొట్టివాడికి ఎడింతలు పొడవున్నది. దానిని వాడు ఊదేటప్పటికి భూమి దద్దరిల్లేటంత ధ్వని అయింది ఆ వెంటనే ఆ ప్రాంతాల వున్న పశువులన్నీ పొట్టివాళ్ల దగ్గరకు వచ్చేసినై. కాపుయువకుడు తనను వాళ్ళు చూడలేదనుకొన్నాడు. కాని, వాళ్లు అతగాడిని రమ్మని పేరుపెట్టి పిలిచారు. వాడు ఆశ్చర్యపడ్డాడు. దగ్గరవున్న మూడు బంగారుపాత్రలూ చూపించి, 'ఇందులో నీకేది కావాలో ఎంచుకో. నీవు ఎంచుకున్న వస్తువును బట్టి నీకు కలిగే ఫలితం వుంటుంది' అన్నారు పొట్టివాళ్ళు.

మూడింటిలోనూ మూడురకాల పానీయాలు ఉన్నాయి. తెల్లని పాలలాంటి పానీయం వున్న పాత్ర కావాలన్నాడు యువకుడు. వాళ్ళు తీసుకొని తాగు అన్నారు. అతడు అలానే చేశాడు.

అప్పుడు పొట్టివాళ్ళు కేరింతలుకొడుతూ, కాపు యువకుడి చుట్టూ నృత్యంచేయసాగారు. "అబ్బాయీ!—సరైన వస్తువు ఎంచుకొన్నావు. వెండిబూరా గెల్చుకొన్నావు!" అంటూ ఒకడు బిగ్గరగా నవ్వి గంతులువేయసాగాడు.

"ఇది మహిమగల బూరా. సరిగా ఇటువంటి బూరాలే ఇంకా తయారుచేసి, నువ్వు తక్కిన పశులకాపరులకు ఊదడం నేర్పవచ్చు. ఇది ఊదితే అడవిలో ఎక్కడెక్కడ వున్న పశువులైనా ఆ వూదినవాడి దగ్గరికి వస్తవి" అని చెప్పాడు రెండవవాడు.

తరువాత మూడవవాడు—"అబ్బాయీ!- నీకు సుఖంగా జీవనం సాగాలంటే జింకలనూ, నెమళ్ళనూ వేటాడటం మాను, వ్యవసాయపుపనులు చేసుకో" అని చెప్పాడు.

ఇలా చెప్పి పొట్టివాళ్ళు ముగురూ అదృశ్యమయ్యారు. వాళ్ళు వంటచేసిన పాత్రలూ అవీ అన్నీ మాయమయినై. వాళ్లు బహుమతి ఇచ్చిన వెండిబూరా మాత్రం వాళ్ళు ఎక్కడ వదిలారో అక్కడనే ఉన్నది. అది స్వచ్ఛమైన వెండితో తయారైన బూరా!

ఉత్సాహంతో కాపుయువకుడు గబగబ ఇంటికి చేరుకొని, తను సంపాదించుకు వచ్చిన వెండిబూరా భార్యకు చూపించి, జరిగిన వింతలన్నీ పూసగుచ్చినట్టు చెప్పాడు. ఆమె సంతోషించింది. ఏమీ అంటే: భర్త వ్యవసాయం మాని, వేటకు బయలుదేరటం ఆమెకు మొదటినించీ ఇష్టంలేదు. ఇప్పుడు ఆ పొట్టివాళ్ళ బోధ వల్ల వాడు వేటాడనని శపథం పట్టడం ఆమెకు సంతోషం కలిగించింది. వేట మాని, ఇప్పుడు వాడు పశువులమందను కాయడం జీవనోపాధిగా పెట్టుకున్నాడు.

అయితే కొన్నాళ్ళతర్వాత ఉండబట్టలేక ఒకనాడు అలవాటు చొప్పున అడవికి పోయి కాపుయువకుడు లేడిని కొట్టాడు. ఈసంగతి ఎవళ్లకూ తెలియనివ్వలేదు.

రోజూలాగానే వాడు సాయంకాలం ఇంటికి వస్తూ వెండిబూరా ఊదాడు. ఇలా ఊదేసరికల్లా రోజూ వాడి భార్య ఎదురు




వచ్చి అతడిని కలుసుకునేది. కాని, ఇవాళ వాడు బూరా ఎంత వూదినా భార్య ఎదురు రావటం అంటూ జరగలేదు.

అంతలో చీకటిపడింది. ఆకాశాన చుక్కలు ప్రకాశిస్తున్నయి. కాపుయువకుడు భార్యను ఎంత పిలిచినా బదులులేదు. యింటికివచ్చి చూస్తే ఆమె కనిపించలేదు.

మరునాడు—

వాడు మళ్ళీ మామూలుప్రకారం అడవికి పశువుల మందను తోలుకు వెళ్ళాడు. అక్కడ తోడి పశువులకాపరి ఒకడు ఇలా చెప్పాడు: 'అన్నా!—నిన్నను నేను మేకలను కాస్తూవుండగా ఒక చిత్రం చూచాను.

కొండమీద ఒక చిన్నది నిలబడివున్నది. ఆమె చిరునవ్వు నవ్వుతూ వనదేవలా కన బడింది. శ్రావ్యమైన గానంచేసి, ఒక చక్కటి పాటకూడా పాడింది. ఆమెను రెప్పవాల్చకుండా చూస్తున్నాను. అంత లోనే ఎక్కడినుండి వచ్చిందో ఒక బాణం వచ్చి ఆమె నిలబడ్డ చోటుకు తాకింది. కాని, అది వచ్చి తగలకముందే ఆ దేవత అదృశ్యమైపోయింది. ఆ మెను కనబడ కుండాచేసిన ఆ దిక్కుమాలిన బాణం ఇదిగో!' అంటూ బాణం ఒకటి పట్టుకవచ్చి కాపుయువకుడికి ఇచ్చాడు.

ఇక యువకుడి ఆశ్చర్యానికి అంతు లేక పోయింది. చూడగా, అది నిన్నటిరోజున తను లేడిని గురిపెట్టి కొట్టిన బాణం.

అప్పుడు యువకుడికి పొట్టివాళ్ళు చేసిన హెచ్చరిక జ్ఞాపకానికి వచ్చింది. తన విల్లమ్ములపైన విరక్తిచెంది, ఆ క్షణాన్నే వాటిని అగ్గిలో పడవేసి భస్మంచేసివేశాడు. మళ్ళీ ఇప్పుడు మరిఒకసారి గట్టిగా శపథం పూనాడు. నాటినించీ పశువులకాపరిపని తప్ప మరొకటి చేయటం మానివేశాడు. మళ్ళీ తన భార్య రాకపోతుందా అని చాలా కాలం ఎదురుచూచాడు.

ఒకనాటి రాత్రి కలలో ఆనాటి పొట్టివాళ్ళు మళ్ళీ కనిపించి 'అబ్బాయీ!—మాట తప్పటమనేది చాలా ఘోరమైన తప్పిదం. ఇందుకు ఫలితం నీవు అనుభవించావు. ఇకనైనా శపథం తప్పక ఉన్నట్టయితే, మళ్ళీ ఏడాది తిరిగేసరికి నీ భార్య నీవద్దకు వస్తుంది. సుఖపడతావు...' అని చెప్పారు.

కాపుయువకుడు తన శపథం తప్పలేదు. ఏడాది తిరిగేసరికి ఒకనాటి సాయంత్రం అడవినుంచి యింటికి వస్తూన్న అతడికి భార్య ఎదురువచ్చింది. యువకుడు చాలా సంతోషించాడు. అతడి జీవితకాలం అంతా పశుపోషణలో గడిపి—అవిధంగా తన శపథం నిలబెట్టుకొన్నాడు.



## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

1954 అక్టోబరు సంచికలో ప్రకటింపబడే ఫోటోలకు నమూనాలు





★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.

★ ఆగస్టు 7-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/-లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26.

## ఆగస్టు నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : వ న చ రు లు | రెండవ ఫోటో : అ ను చ రు లు

పంపినవారు : పడ్డాది చంద్రభాను నియోగి, C/o వి. శేషగిరిరావు,

1/516, అల్కాట్ గార్డెన్స్ - రాజమండ్రి

బహుమతిమొత్తం రు. 10/ ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.




# కిన్నెరరాణి

పూర్వం కాశ్మీరదేశంలో ఒక పేదవాడు ఉండేవాడు. వాడు రోజూ అరణ్యంలోకి వెళ్ళి, అందమైన పిట్టలను పట్టి, వాటిని తెచ్చి అమ్ముకుని తన కుమారుడైన సుధా ముణ్ణి పోషిస్తూ ఉండేవాడు. కొంతకాలానికి తండ్రి చనిపోగా సుధాముడు ఒంటరి గాడైపోయాడు. అంత చిన్న వయసులో తనను తానే పోషించుకోవలసినవాడైనాడు.

తండ్రిపోయిన మర్నాడే సుధాముడు పిట్టలబోను తీసుకొని అరణ్యానికి పోయి, బోనును చెట్టుకొమ్మలలో పెట్టి వేచి కూర్చున్నాడు. కొంతసేపటికి అందులో ఏదో పక్షిపడింది. సుధాముడు చెట్టెక్కి చూసేసరికి బోనులో పడినది కాకి అని తెలుసుకున్నాడు. ఆ కాకిని ఎవరు కొంటారు? ఈ పనికిమాలిన పక్షిని ఏం చెయ్యాలా అని సుధాముడు ఆలోచిస్తుండగా బోనులో పడిన కాకి మానవకంఠంతో—

"అయ్యా, నన్ను వొదిలిపెటినట్టయితే నీకు చాలా ఉపకారం చేస్తాను. రేపటి రోజున నీ బోనులో అతిసుందరమైన పక్షి పడేటట్టు చేస్తాను. దానిని మహారాజు వద్దకు పట్టుకు వెళ్తే నీకు అంతులేని ధనం లభ్యమవుతుంది," అన్నది.

కాకి మాటలు నమ్మి సుధాముడు దానిని బోనువిడిపించాడు. ఆ కాకి చెప్పి నట్టే మర్నాడు సుధాముడి బోనులో ఒక మనోహరమైన పక్షి పడింది. అంత అంద మైన పక్షిని అతడు ఎన్నడూ చూడలేదు. వాడు దానిని తీసుకుపోయి మహారాజు కిచ్చేసరికి మహారాజు చాలా సంతోషించి సుధాముడికి అంతులేని బంగారం ఇచ్చాడు. అంత బంగారం ఏం చేసుకో వాలో వాడికి తెలియలేదు. అంత ధనం వచ్చినా సుధాముడి కష్టాలుమాత్రం తీర లేదు. ఎందుకంటే—

టి. రమాబాయి

కాశ్మీరమహారాజుదగ్గిర విదూషకు డొక డుండేవాడు. ఒక్క పక్షికోసం మహారాజు సుధాముడికి అంత ధనం ఇవ్వటం చూసి విదూషకుడికి కడుపుమండింది. అందు చేత వాడు మహారాజుతో, "ప్రభూ! ఇంత అందమైన పక్షిని లోహపంజరంలో ఉంచటం భావ్యంకాదు. దీనికోసరం ఏనుగుదంతంతో చక్కని ఇల్లు నిర్మించండి," అన్నాడు.

"ఇల్లు నిర్మించేటంత దంతం ఎక్కడ దొరుకుతుంది?" అన్నాడు మహారాజు.

"ఇంతగొప్ప పక్షిని తెచ్చినవాడు దాని ఇంటికి కావలిసిన దంతం తేలేడా? తెమ్మని అజ్ఞాపించండి," అన్నాడు విదూషకుడు.

మహారాజు సుధాముణ్ణి పిలిపించి, "నీవు తెచ్చిన పక్షికి ఒక దంతహర్మ్యం కట్టదలిచాం. దానికవసరమైన దంతాలు పట్టుకురా. నలభైరోజులు వ్యవధి ఇస్తున్నాను. లేకపోతే నీ తల తీసేస్తాను," అని కఠినంగా అజ్ఞాపించాడు.

సుధాముడు విచారంగా ఇంటికి వెళ్లాడు. అంత దంతం తెచ్చుకోవటం మహారాజుకు సాధ్యంకాకనే తనకీపని పెట్టాడనీ, తనకు చావు తప్పదనీ అతడికి తెలిసింది. ఇంతలో కాకి వచ్చి, "ఏం యజమానీ? ఎందుకంత విచారంగా ఉన్నావు?" అని అడిగింది.




తనకష్టాన్ని సుధాముడు కాకితోచెప్పాడు.

"దీనికి యింత విచారపడాలా? రాజుగారిని నలభై పీపాల సారాయి ఇమ్మని అడుగు. ఇక్కడికి నూరు యోజనాలదూరంలో ఒక కొలనున్నది. అ కొలనువద్దకు రోజూ ఏనుగులు గుంపులుగావచ్చి నీరు తాగుతాయి. ఆ కొలనులో సారా కలిపావంటే నీపని పూర్తి అవుతుంది" అన్నది కాకి.

సుధాముడు వెంటనే మహారాజువద్దకు వెళ్ళి, "ప్రభూ, నావెంట బళ్ళమీద నలభై పీపాలు సారా పంపితే తమరుకోరిన దంతం యావత్తూ గడువులోగా పట్టుకొస్తాను," అన్నాడు. మహారాజు సరేనని బళ్ళమీద



నలభై పీపాల నిండుగా సారా పంపించాడు. వెంటనే, కాకి చెప్పిన ప్రకారం సుధాముడు నూరు యోజనాలు ప్రయాణం చేసి ఏనుగుల కొలనుపద్దకు చేరుకున్నాడు. కొలనులో సారా పోయించాడు.

ఆ రాత్రే కొలనువద్దకు పెద్ద ఏనుగుల దండు వచ్చింది. ఏనుగులన్నీ నీళ్లలో కలిసి వున్న సారా తాగేసి మత్తుతో పడిపోయాయి. సుధాముడు రంపంతీసుకుని మగ ఏనుగుల దంతాలన్నీ కోసుకుని బళ్ళమీది కెత్తించి తిరుగు ప్రయాణం కట్టాడు.

దంతంచూసి మహారాజు సంతోషించాడు. సుధాముడికి మరికొంత బహు



మానం ఇచ్చి పంపాడు. త్వరలోనే ఆ అందమైన పక్షికి దంతపు ఇల్లు తయారయింది.

విదూషకుడు మరింత మండిపడ్డాడు. వాడు మహారాజువద్దకు పోయి, "మహాప్రభూ! మన పక్షి దంతహర్మ్యంలో ఉన్నా దాని మనస్సుకు ఆనందంలేదు. అందుకే అది గొంతెత్తి పాడకుండా ఉంది" అన్నాడు.

"దానికి మనం ఏంచెయ్యాలి?" అని అడిగాడు మహారాజు.

"దాని పూర్వపు యజమానిని తెస్తేగాని అది సంతోషంగా పాడదు. ఆ యజమానిని రప్పించండి," అన్నాడు విదూషకుడు.

"దాని యజమాని ఎవరో మనకెట్లా తెలుస్తుంది? మనం ఎట్లా తీసుకురాగలం?" అన్నాడు మహారాజు.

"అంత దంతం తీసుకు రాగలిగినవాడు ఆ పక్షి యజమానిని తీసుకు రాలేడా ఏమిటి?" అన్నాడు విదూషకుడు.

మహారాజు సుధాముణ్ణి తనవద్దకు మళ్ళీ పిలిపించాడు.

"ఈ పక్షి యజమానిని వెతికి నలభై రోజులలోగా తీసుకురా. లేకపోతే నీ తల ఎగిరిపోతుంది" అన్నాడు మహారాజు. సుధాముడు, తన కష్టాలింకా పూర్తి కానందుకు విచారిస్తూ ఇంటికి వెళ్ళాడు.





సుధాముడివద్దకు కాకి మళ్ళా వచ్చింది.

"ఏం, యజమానీ? ఎందుకంత విచారంగా ఉన్నావు?" అన్నది కాకి.

తనకు వచ్చిన కష్టాన్ని కాకితో చెప్పుకున్నాడు సుధాముడు.

"దీనికింత విచారపడాలా? రాజుగారినడిగి ఒక పడవ పుచ్చుకో. అందులో రాజభోగాలకు అనువైన సంబారాలన్నీ అమర్చుకో. ఆ పడవ ఎక్కి నదివెంబడి తూర్పుగా నూరు యోజనాలు వెళ్లావంటే అక్కడ కిన్నెరలుండే ఒకస్థలం వస్తుంది. వాళ్లు పడవ చూడవస్తారు. కాని కిన్నెరల రాణినితప్ప మరెవరినీ పడవ ఎక్కనివ్వకు. ఆమెను వెంటపెట్టుకుని వచ్చెయ్యి. ఆమే ఆ పక్షికి యజమాని" అని చెప్పింది కాకి.




కాకి చెప్పినట్టే సుధాముడు మహారాజునడిగి ఒక పడవ తీసుకున్నాడు. అందులోనే స్నానాలకూ, పడకకూ, విహారానికీ, సమస్త వినోదాలకూ ఏర్పాట్లు చేయించాడు. నదిలో తూర్పుగా ప్రయాణమై వెళ్ళాడు.

కొంతకాలం ప్రయాణం చేయగా, చేయగా కొండలమధ్య కిన్నెరలు వుండే ప్రదేశం వచ్చింది. ఎన్నడూ పడవఅంటే ఎరుగని కిన్నెరలు పడవచుట్టూ మూగారు. కాని సుధాముడు వారిని లోనికి రానివ్వలేదు.

"ముందు మీ రాణీకి పడవ చూపిస్తాను. ఆ తరువాత మిగిలినవారు చూద్దురుగాని," అని వాళ్లతో చెప్పాడు సుధాముడు.

కిన్నెరలరాణి ఈమాటవిని పరమానందభరితురాలై పడవ ఎక్కింది. ఆ పడవలో ఒక్కొక్కగదీ, ప్రతి గదిలోనూచేసిన అలంకారాలూ, దీపాలూ, తివాసీలూ, మెత్తలూ చూస్తూంటే ఆమెకు కాలం ఎట్లా గడుస్తున్నదీకూడా తెలియలేదు. ఈలోగా పడవ తెరచాపలెత్తి, దానిని తిరుగుముఖం పట్టించారు. కిన్నెరలరాణి పడవ చూడటం పూర్తిఅయేసరికి పడవ అప్పుడే నాలుగైదు యోజనాలుదాటి వచ్చేసింది.

సుధాముడు కిన్నెరల రాణితో మహారాజుగారి ప్రాంగణంలో అడుగుపెట్టాడో లేదో, అప్పుడే దంతహర్మ్యంలో ఉన్న పక్షి గొంతెత్తి అతిశ్రావ్యంగా పాడసాగింది. మహారాజు పరవశుడయాడు. కిన్నెరల రాణిని చూశాక మహరాజు పారవశ్యం మరింత అధికమయింది. ఆయన ఆమెను పెళ్ళాడ నిశ్చయించాడు. ఆమె సమ్మతించింది.

పెళ్ళిప్రయత్నాలన్నీ ఆర్భాటంగా జరిగాయి. పెళ్ళికి గొప్పగొప్పవాళ్లంతా వచ్చారు. సుధాముడికకూడా ఆహ్వానం వెళ్ళింది. అసలు అతనే పెళ్ళిపెద్ద.

ఈ సమయంలో పెళ్లి చూడటానికి సుధాముడి భుజంమీద ఎక్కి అతని స్నేహితురాలైన కాకికూడా వచ్చింది. ఆ కాకిని చూడగానే కిన్నెరరాణి మండిపడి, "ఓసి, పిశాచీ! ఇక్కడికీ వచ్చావుటే?" అన్నది.

"ఈ కాకి నాకు ఆప్తస్నేహితురాలు. ఈమెవల్ల ఏదన్నా అపచారం జరిగిఉంటే క్షమించండి!" అని కిన్నెరరాణిని వేడుకుంటూ, సుధాముడు ఆ కాకివల్ల తనకు జరిగిన సహాయం వివరించాడు. ఆ కథ విన్నాక కిన్నెరరాణి శాంతపడింది.

"ఇది నా చెలికత్తె. చాలా పొగరుబోతుది. అందుకని కాకిగా మార్చేశాను. శిక్షించినా దానికి నామీద ఇంకా అభిమానం ఉన్నట్టే ఉంది. సరే, దీనికి శాపవిమోచనంచేస్తాను!" అన్నది కిన్నెరరాణి.

మరుక్షణం సుధాముడి భుజంమీది కాకి రెక్కలు విదిలించి, కిన్నెరరూపంలో అతనిపక్కనే నిలబడింది.

ఇదంతా చూసిన కాశ్మీరరాజు చాలా సంతోషించి తన పెళ్ళిముహూర్తానికే సుధాముడికీ, శాపవిముక్తిపొందిన కిన్నెరకూ వివాహం చేయించేశాడు. దుష్టబుద్ధి అయిన విదూషకుణ్ణి కొరతవేయించాడు. సుధాముడు రాజుగారి కొలువులోనే వుండి తన కిన్నెర భార్యతో సుఖంగా కాలంగడిపాడు.






ఒక ఊరి వెలపల ఖాళీస్థలంలో ఒక చింత చెట్టుండేది. దాని మొదట్లో ఒక చెత్త పోగుండేది. ఈ చెత్తపోగులో పాతదైన జాజి చెక్కలపెట్టె ఒకటి ఉండేది. అందులో ఒక చిట్టెలుక నివాసం ఏర్పరచుకున్నది. ఈ పెట్టెలో ఒక మూలకంత ఉంది. చిట్టెలుక రాకపోకలకు వీలుగా ఉంటుండేది. వాన కురిసినా, శతృభయం ఏర్పడినా చిట్టెలుక పెట్టెలో దాక్కునేది. ఆ పెట్టెలోనే చిన్న దాన్యంకుప్ప చేర్చుకుని చిట్టెలుక సుఖంగా వుంటున్నది.

చిట్టెలుకకూ, చింతచెట్టుమీద ఉండే పిచ్చుకమ్మకూ స్నేహం. అందుచేత ఒక రోజు పిచ్చుకమ్మ చిట్టెలుక ఇల్లు చూసి పోదాంకదా అని వచ్చింది. కష్టపడి కంత దగ్గిరికిచేరి లోనికి తొంగి చూసింది.

"ఎలాఉంది ఇల్లు?" అన్నది చిట్టెలుక.

"ఏం ఉండటంలే? కిటికీలా, పాడా? అచ్చంపెట్టెలా ఉంది!" అన్నది పిచ్చుకమ్మ.

"ఇంకా నయం! అచ్చంపెట్టెలా ఉండట మేమిటి? పెట్టే అయితేను! కిటికీలా అవీ ఉంటే పిల్లెమ్మగాని తొంగిచూసిందో నేను ఆఖరే!" అన్నది చిట్టెలుక.

"నాకు తెలీకడుగుతానూ, ఉన్నదే కాస్త కొంపగదా? అందులో ఈ ధాన్యం పోగుకూడా ఏమిటీ?" అన్నది పిచ్చుకమ్మ.

"అది లేకపోతే ఎలాగక్కా? వాన వస్తుంది, ఉంగడొస్తుంది. రెండు రోజుల పాటు గ్రాసం నిలవ వుంచుకోవద్దూ?" అన్నది చిట్టెలుక.

"అటువంటప్పుడు నువు ఇక్కడ అవస్త పడేకన్నా, అలా వాగుదాటి వెళ్ళి పెదకాపు గారి చేలో ధాన్యం రాశి చేరగూడదూ?" అన్నది పిచ్చుకమ్మ.

"అక్కడేమిటి సుఖం?" అన్నది చిట్టెలుక మీసాలు నిక్కించి.

పి. శోభనాద్రిరావు




"సుఖమా? అక్కడ వందలేసి చిట్టెలుకలు కాపరం ఉంటున్నాయి. ధాన్యంలోనే పడక, ధాన్యంలోనే కూర్చోవటం, ధాన్యంలోనే షికారుకు వెళ్ళటం! ఆకలేసినప్పుడల్లా అలా తల పక్కకి తిప్పి గింజలు కొరకటమే. ఎంత రాశి అనుకున్నావ్? ఆ రాశిలో ఎన్ని బజార్లు, ఎన్ని సొరంగాలు, ఎన్ని గూళ్లు! చెప్ప తరంగాదనుకో!"

చిట్టెలుక, పిచ్చుకమ్మ మాటలు నమ్మలేక పోయింది. చిట్టెలుకల్ని కష్టపడమని దేవుడు పుట్టించాడనుకుందిగాని, ఇలాంటి రాజోపచారమైన ఏర్పాట్లు ప్రపంచంలో ఉన్నాయని కలలోకూడా ఊహించలేదు.

"అక్కా, నువు చెప్పింది నిజమైతే ఈ క్షణం అక్కడవెళ్ళి వాలాలని ఉంది" అన్నది చిట్టెలుక.

"నష్టమేముందీ? ఒకసారి వెళ్లి చూడు తమ్ముడూ! నే చెప్పినదాంటో అబద్ధమేమన్నా ఉంటే నన్నడుగు!" అంటూ పిచ్చుకమ్మ తుర్రున ఎగిరి చెట్టెక్కింది.

* * *

ఆ సాయంకాలమే చిట్టెలుక వాగుకేసి బయలుదేరింది. పోగా, పోగా, పోగా వాగు చప్పుడు గలగలా వినిపించింది. అలిసి దప్పిగొని ఉన్న చిట్టెలుక గబగబా వాగుచేరింది. ఒడ్డున నీళ్ళలోకి ఉన్న రాళ్లమీదుగా పరిగెత్తి, మూతి నీటిలోకిపెట్టి కడుపునిండా తాగి, తలఎత్తి మీసాలు తుడుచుకుంటుండగా భయంకరమైన చప్పుడు వినిపించింది.

చిట్టెలుక అటుకేసి చూసేసరికి పెద్ద తామరాకుమీద నీటివాలున వస్తూ కప్ప ఒకటి కనిపించింది. చూస్తుండగానే ఆ తామరాకు గుండ్రంగా తిరిగి ఒడ్డునవున్న రాతి మీదికి కొద్దిగా ఎక్కింది. దానితో కప్ప ప్రయాణం అక్కడే నిలిచిపోయింది.

"తమ్ముడూ, కాస్త కాలితో ఆకును నీళ్ళలోకి నెట్టవేయ్!" అన్నది కప్ప బొంగురుగొంతుతో బెకబెకమంటూ.

"దానికేం భాగ్యంగాని, పెదకాపుగారి పొలం ఎటుందో కాస్త చెప్పి పుణ్యం కట్టుకుంటారా?" అన్నది చిట్టెలుక.

"దిగువనే ఉంటుంది, ఉండకేం చేస్తుంది. కావలిస్తే నువ్వుకూడా వచ్చి ఆకుమీద ఎక్కి కలిసి పోదాం" అన్నది కప్ప.

సరేనని చిట్టెలుక చెంగున ఎగిరి ఆకుమీద కప్పపక్కనే కూచుని కాలితో రాతిని తోసింది. ఆకు మళ్ళీ నీటిలో పోసాగింది.

"ఒక్క క్షణంలో వస్తా. ఆ రాతిమీద ఈగ ఒకటి ఉంది" అంటూ కప్ప ఒక్క దాటున ఒడ్డుమీద ఉన్న రాతిమీదికెగిరి క్షణంలో మళ్ళీ ఆకు మీదికి వాలింది. చిట్టెలుక నీటిలో పడినంత పని అయింది.

"చెప్పకుండా పెట్టకుండా తమరలా గెంతటం ఏమీ బాగాలేదు. కాస్తయితే నేను నీటిలో పడివుందును," అన్నది చిట్టెలుక.

కప్ప బొంగురుగా నవ్వి, "నీరేగద! ఈదితే సరిపోలా?" అన్నది.

"ఇంకా నయం! నాకు యీతరాదు!" అన్నది చిట్టెలుక.

కప్ప ఏదో చెప్పబోతూండగా ఒడ్డున మళ్ళీ ఏదో కీటకం కనిపించింది. ఒక్క దాటున కప్ప ఒడ్డుకు దూకింది. ఈసారి చిట్టెలుక నిజంగానే నీటిలో పడింది. తనకు




భూమిమీద నూకలు చెల్లాయనుకుంటుండగా ఒక అలవచ్చి చిట్టెలుకను ఒడుకు తోసేసింది. చావు తప్పితేనేం చిట్టెలుక తడిసి ముద్దయిపోయి వణకసాగింది.

"అంత చాతగానప్పుడు ఈతలాడక పోతేనేం?" అన్న మాటలు వినిపించాయి చిట్టెలుకకు. అది తలతిప్పి చూసేసరికి ఒక మామిడి చెట్టు మొదట్లో కూర్చుని వున్న ఉడత కనిపించింది.

"నాఅంతట నేనెక్కడైనా ఈదుతానా మామా? ఇదంతా ఆ దిక్కుమాలిన కప్ప చేసిందిగానీ!" అంటూ చిట్టెలుక తుమ్మింది.



"ఎట్లాగైనా తడి ఆర్చుకోకపోయావో జలుబు చేసుకొస్తుంది. ఉండు మొన్న గాలివానకు కొట్టుకొచ్చిన పాత తువాలా ముక్క తొర్రలో ఉండాలి. తెస్తా!" అంటూ ఉడత గబగబా చెట్టెక్కి తువాలు ముక్కతో తిరిగివచ్చింది.

చిట్టెలుక దాన్ని వొంటిచుట్టూతా చుట్టేసుకుని కదలకుండా వెచ్చగా ఒకచోట కూచుంది. ఈ వినోదం ఏమిటో చూడటానికని చెట్టు తొర్రలోనుంచి ఉడతపిల్లలు కూడా బయటకొచ్చాయి.

ఇంతలో ఆకాశంనుంచి "కృష్ణా" అని చెవులు దిబ్బిళ్ళెత్తించే కేక వినబడింది.

"అదుగో, గరుత్మంతుడు! యెక్కడి దొంగలక్కడే! గప్‌చిప్!" అన్నది చెట్టు మీద కావలికూచున్న కాకి.

"అమ్మయ్యో! వస్తున్నాడు యమధర్మ రాజు. 'కృష్ణా' అంటూనే గుటకాయ స్వాహా చేసేస్తాడు! మీరు తొర్రలోకి పోరేమ్రా? అల్లుడూ! ఏమాత్రం కదలకు. పైన భగవంతుడే ఉన్నాడు!" అని అడావుడిచేస్తూ పిల్లలతోసహా ఉడత తొర్రలోకి వెళ్ళిపోయింది.

ఆకాశాన గరుడపక్షి రెండు చుట్లు చుట్టింది. తినటానికేమీ కనబడలేదు. మామిడిచెట్టు మొదట్లో తువాలు ఉండ కనిపించిందిగాని అందులో తన ఆహారం ఉందని దానికి తోచలేదు. అది మరో ప్రాంతానికి వెళ్ళిపోయింది.

చిట్టెలుక ఇప్పుడు పొడారిపోయింది. అది తువాలు ఊడవేసుకుని బయటకి వచ్చింది. తొర్రలోనుంచి ఉడత, దాని పిల్లలుకూడా బయటికి వచ్చాయి.

"మీ దయవల్ల ఇవాళ నా వొళ్ళు ఆరింది, ప్రాణమూ దక్కింది. ఈ తువాలు లేకపోతే నేనేమై ఉందునో! దయచేసి పెదకాపుగారి పొలానికి దారి చెబుతారా?" అన్నది చిట్టెలుక.

"పెదకాపుగారి పొలం ఆ కనబడే జొన్న చేను మలుపులోనే ఉంది," అని చెప్పింది కాకి.

చిట్టెలుక అందరిదగ్గిరా సెలవుపుచ్చుకుని జొన్నచేనుకేసి బయలుదేరింది.

* * *

అలా ఎదురుగా కనిపిస్తూనే ఉందిగాని, ఎంతోసేపు నడిస్తేనేగాని జొన్నచేను రాలేదు. దాని వెంబడి ఎంత నడిచినా ఆ జొన్నచేను తరగదు! అంత పెద్ద చేను కూడా ఉంటుందని చిట్టెలుక ఎరగదు. ఎలాగైతేనేం, జొన్నచేను గడిచి మలుపు తిరిగిందో లేదో వరి పొలంలో పెద్ద ధాన్యం రాశిలాంటిది కనబడింది. అదేం రాశి! అందులో ఎన్నివేల చిట్టెలుకలు కాపరం ఉండొచ్చు! అన్ని చిట్టెలుకలూ తిన్నప్పటికీ ఆ రాశి ఎప్పటికి తరగను!

పరమానందంతో చిట్టెలుక ఆ రాశి మీదికి ఎగబాకింది. నిజానికి ఆ రాశి యావత్తూ, ధాన్యంకాదు. అందులో తప్పా, తాలూ, గడ్డీ గావంకూడా ఉంది. అక్కడక్కడా ధాన్యం గింజలూ ఉన్నాయి. ఆ సమీపంలోనే పెద కాపుగారి ధాన్యపు కొట్లున్నాయి. ఆ ధాన్యం జోలికి ఎలుకలూ అవీ రాకుండా ఉండేందుకై పెదకాపు పనికి




రాని ధాన్యమూ అదీ పొలంలో రాశిపోశాడు.

ఆ రాశి సమీపానికి వెళ్లి చిట్టెలుక అకస్మాత్తుగా ఆగింది. అక్కడ ఒక ఎలుక ధాన్యపు గింజల్ని ఎంచితీస్తూ చిట్టెలుకకు కనిపించింది.

"కావలిస్తే బోంచెయ్యక ధాన్యపు గింజలు యెంచుతున్నావెందుకు అన్నయ్యా?" అని అడిగింది చిట్టెలుక.

"ఓ, నువు కొత్తవాడివి వచ్చావా? అయితే ఈ ఆహారం తీసుకువచ్చే పని నీది. పదిహేడుమందికి ఆహారం కావాలి, వేగిరం పట్టుకురా! ఊ!' అని ఎలుక తొందర చెయ్యసాగింది.

చిట్టెలుకకు చాలా ఆశ్చర్యం వేసింది. "ఆహారం కావలిసినవాళ్ళు వచ్చి తిన లేరూ? ఒకరి ఆహారం ఒకరు మోసుకు రావటమేమిటి? నేనెక్కడా వినలేదు" అన్నది చిట్టెలుక.

"ఆటే వాగకు! ఇక్కడి ఏర్పాటింతే. కొత్తగా వచ్చినవాళ్లు పాతవాళ్లకోసం పాటు పడాలి. తేరగా వచ్చిందిగదా తిందామను కున్నావుగామాలు! మాకు చాకిరి చేస్తేనే నీకు తిండి! లేకపోతే ఒక్క గింజ ముట్ట డానికి వీల్లేదు" అన్నది ఎలుక.

చిట్టెలుకకది ఏమీ నచ్చలేదు. అది వెళ్ళి పోవటానికి సిద్ధపడింది, కాని రెండో ఎలుక దానిచెయ్యి పట్టుకుంది. రెండూ గుంజుకో సాగాయి. ఇంతలో ఒకపావురం అక్కడ వాలి, "ఊరుకోండి! ఊరుకోండి! పోట్లాడు కుంటారెందుకు? శాంతించండి!" అన్నది.

"నువు ఇల్లువిడిచి ఎందుకొచ్చావు?" అని అడిగింది పావురం చిట్టెలుకను గుర్తించి.

"ఇక్కడ అద్భుతమైన ధాన్యపురాశి ఉందని పిచ్చుకమ్మ చెబితే వచ్చాను" అన్నది చిట్టెలుక.

"పిచ్చివాడా! ఆ పిచ్చుకమ్మ కబుర్లు విని బయలుదేరి వస్తారా? ఇదంతా పనికి మాలిన ధాన్యం. నువు కష్టపడి తెచ్చుకు తినే ధాన్యంతో పోలిస్తే ఇది ఏపాటి? వట్టి తుక్కు కాదూ? దీనికోసం ఇక్కడి ఎలుక లన్నిటికీ అడవా చాకిరీ చేస్తావా? నేను మనవైపుకు పోతున్నాను. కావలిస్తే నా వీపుమీద ఎక్కి కూచో! తీసుకుపోతాను!" అన్నది పావురం.

చిట్టెలుక తన ఇంటికి తిరిగివచ్చింది. దూరపు కొండలు నునుపనీ, తన ఇల్లు లాటిది ప్రపంచంలో ఎక్కడా లేదనీ గ్రహించింది. కాస్త కష్టపడి పనిచేస్తేనే సుఖం వుందని తెలుసుకుని, ఆరోజునుంచీ లేనిపోని దురాశలకు పోక తనయింట్లో హాయిగా బ్రతకసాగింది.



# అట్టమీది బొమ్మ

అరణ్యవాసంలో ఉన్న ధర్మరాజు అనేకమైన పుణ్యకథలు వింటూవచ్చాడని చెప్పాముకదా! అందులో ఒక స్వారస్యమైన కథ ఇది—

పూర్వం అంగరాజ్యానికి రోమపాదుడు ప్రభువుగా ఉండేవాడు. ఆయన ఒకప్పుడు తన ధర్మాన్ని తప్పాడు. అందుచేత వర్షాలు కురవడం నిలిచిపోయి, దేశంలో క్షామం పట్టింది. తరువాత రాజు తప్పు తెలుసుకొని పశ్చాత్తాపపడ్డాడు. వెంటనే మంత్రి పురోహితులను పిలిపించి, వర్షం కురిపించడం ఎలాగా అని ప్రశ్నించాడు. అప్పుడు అనుభవజ్ఞులైనవారు యీవిధంగా సలహా చెప్పారు: 'విభాండకుడనే ఋషి వున్నాడు. ఆయన ఆశ్రమం ఎప్పుడూ పచ్చగా, కనుపండుగా వుంటుంది. దీనికి కారణం: ఆయన కుమారుడైన ఋష్యశృంగుడు అక్కడ తపస్సు చేసుకొంటూ వుండటమే. ఋష్యశృంగుడు ఎక్కడ వుంటే అక్కడ నెలకు మూడు వర్షాలూ కురుస్తాయని దేవేంద్రుని వరం ఉన్నది. కనుక, ఆ ఋష్యశృంగుని ఎలాఐనా మన రాజ్యానికి రప్పించి యజ్ఞయాగాదులు చేసినట్టయితే, దేవేంద్రుడికి సంతోషం కలుగు తుంది. దానివల్ల సవ్యంగా వర్షాలు కురిసి దేశం సుభిక్షమవుతుంది.

'ఐతే—ఋష్యశృంగుని రప్పించటం తేలికకాదు. అతని తండ్రికి తెలియకుండానే ఈ పని జరగాలి. ఋష్యశృంగుడు ఇంతవరకు స్త్రీని చూచి ఎరుగడు. కాబట్టి, అందకత్తెలైన స్త్రీలు కొందరిని పంపించి అతనిని ఆకర్షించవచ్చు,' అని చెప్పారు.

ఆ ప్రకారం రోమపాదుడు కొంతమంది అందకత్తెలను విభాండకుని ఆశ్రమానికి పంపాడు. అందరిలోనూ అత్యంత సౌందర్యంగల ఒకామె ఋష్యశృంగునిదగ్గర చేరి, మధురమైన మాటలతోనూ ఉపచారాలతోనూ అతనిని మెప్పించింది. తను ఎలా చెబితే అలా నడుచుకొనేటట్టు చేసింది. అతడు ఆమెవెంబడే బయలుదేరి అంగరాజ్యం చేరుకొన్నాడు.

రోమపాదుడు ఋష్యశృంగుణ్ణి చాలా గౌరవించి, తన పుత్రిక ఐన శాంతను ఇచ్చి వివాహంచేశాడు. సంతోషించి దేవేంద్రుడు వర్షాలు కురిపించాడు. అంగరాజ్యం సుభిక్షమయింది. ఇలా మోసం జరిగినందుకు అక్కడ విభాండకుడికి కోపంవచ్చింది. కాని, ఇది సత్కార్యం కావటంచేత శాంతించాడు.




మహారాష్ట్రదేశంలో ఇందూరు సంస్థానాన్ని రాణి అహల్యాబాయి పాలించే కాలంలో వినాయకరావు గంధేకర్ అనే సంగీత విద్వాంసుడుండేవాడు. అతడు గొప్ప కవీ, భక్తుడూ కూడానూ. అందుచేత అతడు భక్తిరసప్రధానములైన కీర్తనలు రచించి, వాటికి తానే సంగీతం జతచేసి, పాడి అందరికీ వినిపిస్తూండేవాడు.

కవిగానూ, గాయకుడుగానూ గంధేకర్ కీర్తి నలుదిశలా వ్యాపించింది. నిత్యమూ ఆయన ఇంటికి ఎందరో భక్తులూ, సంగీత ప్రియులూ, ధనికులూ, జమీందారూకూడా వచ్చి, కానుకలర్పించి పోతూండేవారు.

ఇలా వచ్చిన ధనంతో గంధేకర్ బీదసాదలకు సంతర్పణలు చేసేవాడు. ఈ విధంగా ఎంత డబ్బువచ్చినా ఖర్చయిపోతూండేది; ఎంత ఖర్చుచేసినా మళ్ళీ కానుకల రూపంలో వచ్చిపడుతూండేది.

గంధేకర్ జీవితానికి ఏ కొరతా లేదు— సంతానం లేకపోవటంతప్ప. చివరకాయన బిడ్డలు లేకుండానే తన ఇష్టదైవమైన పాండురంగడిలో ఐక్యమయాడు. ఆఖరు క్షణంలో ఆయన తన భార్యఅయిన రుక్మాబాయిని పిలిచి ఈవిధంగా చెప్పాడు:

"రుక్మా, మనకు బిడ్డలు లేరు. అయితే మానవులకు బిడ్డలుమాత్రమే సంతానం కాదు. సప్తసంతానాలలో ఏ ఒకటీ నేను సాధించలేదు. కనుక నా అనంతరం మనదగ్గిర ఉన్న డబ్బుతో చెరువులూ, నూతులూ, ఆలయాలూ, సత్రాలూ మొదలైనవి ఏర్పాటు చేయించు. ఇదే నా కోరిక."

భర్త పోయాక రుక్మాబాయి ఆ విధంగానే చేయ నిశ్చయించింది. కాని ఒక అవాంతరం వచ్చిపడింది. ఒకనాడు ఇందూరుసంస్థాన సేనాధిపతి తుకాజీ తన భటులతో వచ్చి గంధేకర్‌కు బిడ్డలు లేరు

పాలంకి వెంకటరామచంద్రమూర్తి

గనక, శాసనంప్రకారం. అతని ధనం యావత్తూ రాణీగారికి వప్పగించమన్నాడు. రుక్మాబాయి తన జీవనభృతికి అందులో కొంతమాత్రమే మిగుల్చుకోవచ్చును.

రుక్మాబాయి తుకాజీకి తన భర్త తుది కోర్కె వివరించి చెప్పింది. కాని శాసనం అలా ఉన్నప్పుడు తుకాజీ ఏం చేయ గలడు? గంధేకర్ ధనాన్ని పట్టించుకు పోయి రాణిగారి ఖజానాకు చేర్చాడు.

రుక్మాబాయి రాణి అహల్యాబాయివద్ద అర్జీపెట్టుకున్నది. రాణిగారి కొలువుకు వెళ్లి తన భర్తకు చెందిన ధనాన్ని తనకు తిరిగి ఇప్పించినట్లయితే ఆయన తుదికోర్కె ప్రకారం చెరువులూ, బావులూ, ఆలయాలూ, సత్రాలూ కట్టిస్తానన్నది.

రాణి అహల్యాబాయి రుక్మాబాయి చెప్పినదంతా విని, గంధేకర్ ఇంటినుంచి తెచ్చిన సొమ్ము తిరిగి ఇచ్చివేయవల సిందిగా తుకాజీకి ఉత్తరువు ఇచ్చింది.

తుకాజీ నిర్ఘాంతపోయి, "దేవీ, ఇది శాసనానికి విరుద్ధం!' అన్నాడు.

"ఆ సొమ్ముతో మనం ఏం చేస్తాం?" అని అడిగింది రాణి తుకాజీని.

"చెరువులు, బావులు తవ్వించటం, సత్రాలు కట్టించటంవంటి ప్రజోపయోగా లకు ఖర్చుపెడతాం!" అన్నాడు తుకాజీ.

"అవును. ఈ రుక్మాబాయికూడా ఈ ధనాన్ని అందుకే ఖర్చుపెడుతుంది. ఇక తేడా ఏమంటే మన అధికార్లు కేవలం జీతాలకొరకు పని చేస్తారు. ఈమె అలాకాక, తన భర్తమీది భక్తితో ఇవే పనులు స్వయంగా చేయిస్తుంది. ఇందులో ఒక్క చిల్లిగవ్వ కూడా జీతంకింద పుచ్చుకోదు. కనుక ఆ ధనం ఆమెకు తక్షణం ఇచ్చి వెయ్యి!" అని రాణి అహల్యాబాయి తుకాజీకి ఆజ్ఞాపించింది.

రాణిగారి తీర్పుకు ఇందూరుసంస్థాన ప్రజలందరూ చాలా సంతోషించారు.






# రాత్రా? పగలా?

ఐదారు వందల సంవత్సరాల కిందట ఓరుగల్లుపట్టణ సమీపంలో వరాహగిరి అనే చిన్న పల్లె ఒకటి వుండేది. ఆ పల్లెలో కడు బీదవాడైన ఒక కమ్మరి వుండేవాడు. ఊహ తెలిసినప్పటినుంచీ అతడు ఆ వృత్తిలో వున్నా కూడబెట్టిన ధనం యేమీలేదు.

కమ్మరికి తన ఈ బీదస్థితినిగురించి ఆలోచించినప్పుడల్లా ఎంతో భయం కలుగుతూండేది. 'ముసలివాణ్ణయిపోతున్నానే, పనిచేయలేని స్థితివస్తే—యిక బ్రతకటం ఎలా?' అని దిగులు పడుతూండేవాడు.

ఒకనాడు ఇలాంటి తలపులతోనే బాధ పడుతూ అతడు ఓరుగల్లుకు పనిమీద బయలుదేరాడు. భుజాన అన్నంమూటా, చేతిలో ఒక పాత వంకర కర్రా—యీ వేషంతో అతడు ఓరుగల్లుకు సమీపంలో ఒక వంతెన దాటుతున్నాడు.

అదే సమయంలో వంతెనకు ఆ వైపు నుంచి వస్తూన్న ఒక పండితుడు అతడికి తారసపడ్డాడు. కమ్మరి చేతిలోవున్న వంకర కర్ర కంటపడేసరికి పండితుడు ఆశ్చర్య పడ్డాడు. కాని దానిని కప్పిపుచ్చుతూ—

"మీది ఏ ఊరు?" అని నవ్వుతూ అడిగాడు పండితుడు. అందుకు కమ్మరి తను నివసిస్తూవున్నది వరాహగిరి అనే చిన్నపల్లె అని తెలియపరిచాడు.

పండితుడు కాస్త తటపటాయించి కమ్మరి చేతిలోవున్న వంకర కర్ర అడిగి తీసుకొని పరీక్షగా చూశాడు. కమ్మరికి పండితుడి ప్రవర్తన ఆశ్చర్యం కలిగించింది. తను పది పదిహేనేళ్లనుంచి చేత బట్టుకు తిరుగుతున్న వంకర కర్రని వింతగా చూస్తాడేమా యీ చదువుకున్న పెద్దమనిషి అనుకొన్నాడు.

వి. మల్లేశ్వరరావు



పండితుడు కఱ్ఱని కమ్మరికి తిరిగి యిచ్చి వేస్తూ "ముసలాయనా, నువ్వు ఎలాంటి వాడివో నాకు తెలీదు. అయినా నమ్మి మనిద్దరికీ మేలుకూర్చే ఒక రహస్యం చెపుతున్నాను. విని నేను చెప్పినట్టు చేశావో, మనం లక్షాధికార్లం అవుతాం!" అన్నాడు.

కమ్మరికి పండితుడి ఈ మాటల ధోరణి ఏమాత్రం అర్థంకాలేదు. తన చేతనున్న తెల్లనేరేడు వంకర కఱ్ఱలో లక్షలు విలువ చేసే మహత్తు ఏముందా అనుకున్నాడు.

"మీరనేదేమిటో నాకు తెలీటంలేదు. ఇది మా పల్లెపక్క వున్న వాగు ఒడ్డునే పెరిగిన తెల్లనేరేడు చెట్టు కఱ్ఱ. అణా డబ్బులిస్తే మా పల్లె కఱ్ఱవాడెవడైనా మీకు ఇంతకంటె నిటారుగావున్న కఱ్ఱ కొట్టిపెడతాడు" అన్నాడు కమ్మరి.

అప్పుడు పండితుడు కమ్మరి చేయి పట్టుకుని వంతెనమీంచి పక్కకు తీసుకుపోయి యిలా చెప్పాడు:

"నేను ఈ ఓరుగల్లుపట్టణ విద్యాలయంలో ఉపాధ్యాయుణ్ణి. ఈ కఱ్ఱను ఏ చెట్టునుంచి కొట్టావో ఆ చెట్టును నువు గుర్తుపెట్టుకోవటం నిజంగా మన అదృష్టమే అనాలి. తెల్లనేరేడు చెట్లు ఈ ప్రాంతంలో లేవు. ఆ వాగు పక్కనవున్న తెల్లనేరేడు అనేసరికే నాకు రహస్యం తెలిసిపోయింది. ఆ చెట్టు మొదట్లో అక్రంఖాన్ ఖజానా అంతా పాతిపెట్టబడివుంది. గుట్టు చప్పుడుగా ఆ ధనాన్ని మనం మోయగలిగినంత ఎత్తుకుపోవచ్చు."

'అక్రంఖాన్ ఖజానా' అన్నమాట వినేసరికి కమ్మరికి తన చిన్ననాటి సంగతులు గుర్తుకొచ్చినై. అక్రంఖాన్ అప్పటికి వంద సంవత్సరాల కిందట ఆ ప్రాంతాల్లో పేరు మోసిన బందిపోటు. అనాటి అరాజక స్థితిలో అతడు ఊళ్ళమీదపడి దోచుకొన్నాడనీ, ఆ ధనమంతా ఎక్కడో దాచాడనీ, చాలామంది నమ్మకం.



కమ్మరికి యీ సంగతులన్నీ గుర్తుకొచ్చే సరికి పండితుడు చెప్పినదాంట్లో నిజం ఉండవచ్చుననుకున్నాడు. ఈ విధంగానైనా బీదతనం పోయి భాగ్యవంతుడు కావచ్చు గదా అన్న ఆశ కలిగింది.

ఇంకేం పండితుడికి తెల్లనేరేడు చెట్టు చూపేందుకు అంగీకరించాడు. యిద్దరూ కలిసి సూర్యాస్తమయానికల్లా వరాహగిరి పల్లె పక్కన వాగుదగ్గరకు చేరారు. ఆ వాగు అంచునే తెల్ల నేరేడుచెట్టు కనిపించింది.

బాగా చీకటిపడేవరకూ ఆగి, కమ్మరి యింటికి వెళ్లితెచ్చిన పారాపలుగులతో ఆ చెట్టు మొదట్లో తవ్వసాగారు. దాదాపు ఒక గజం లోతు తవ్వేసరికి వాళ్ళకు ఒక పెద్ద బండ కనిపించింది. యిద్దరూ బలంగా పట్టి దాన్ని ఎత్తి పక్కనపెట్టారు.

అక్కడ ఆ బండకింద వాళ్ళకు పెద్ద సొరంగం కనిపించింది. కాగడా వెలిగించుకొని యిద్దరూ ఆ సొరంగం వెంట కొంత దూరం నడిచారు. ఒకచోట వేలాడుతూన్న పెద్దగంట కనబడింది. ఆ దాపులనే నేల మీద చెల్లాచెదురుగా పడివున్న బంగారు నగలూ, నాణ్యాలూ కనిపించినై.

అంతధనం కంటబడేసరికి కమ్మరికి ఎక్కడలేని ఆతృతా కలిగింది. అటూ ఇటూ పరుగెత్తుతూ, వెంట తెచ్చుకొన్న గోతాంలో బంగారు నాణ్యాలూ, నగలూ వేసుకోసాగాడు. ఆ హడావిడిలో అతడి తల అక్కడ వేలాడుతూన్న గంటకు తగిలి ఖంగుమని మోగింది. ఆ వెంటనే గోడ పక్కన నీడలోనుంచి ఒక భయంకరాకారుడు కళ్లు నులుముకుంటూ "యిది రాత్రా, పగలా?" అని గర్జించాడు.

"యిది పట్టపగలు, యింకా రాత్రి కాలేదు!" అని తొణక్కుండా పండితుడు జవాబిచ్చాడు. మరుక్షణంలోనే ఆ భయంకరాకారుడు గోడపక్క నీడలో పడుకుని కళ్ళుమూశాడు.



దీనితో కమ్మరికి హడలెత్తిపోయింది. యీ సొరంగంలోని ధనరాసుల్ని కాపలా కాస్తూ ఒకరున్నారనేది అప్పటిగ్గాని అతడికి అవగాహన కాలేదు.

"ఏడెవడు? ఆ నిప్పులుచెరిగే కళ్ళూ, చేతిలో కత్తీ నాకు భయంగావుంది" అన్నాడు కమ్మరి. అందుకు పండితుడు:

"నీకేం భయంలేదు. ఆ వేలాడుతూన్న గంటనిమాత్రం తాకకుండా నీకు కావలసిన వెండి బంగారాలు గోతాంలో వేసుకో. నువ్వు ఒకవేళ గంటకు తగిలి శబ్దమైతే నేనిచ్చిన జవాబేయివ్వు" అని చెప్పాడు.

తరవాత అరగంటకల్లా ఏ ప్రమాదం లేకుండా యిద్దరూ వెంట తెచ్చుకున్న గోతాలలో వెండీ బంగారాలు నింపుకొని సొరంగంనుంచి బయటికి వచ్చారు. ఆ చెట్టుమొదట్లో త్రవ్వితీసిన బండను యథాస్థానంలోవుంచి మన్నుకప్పారు. పండితుడు ఓరుగల్లుకూ, కమ్మరి ఇంటికీ వెళ్లిపోయారు.

నాలుగైదు నెలలు గడిచినై. కమ్మరి తను తెచ్చుకొన్న ధనంతో చక్కని భవనం నిర్మించుకొన్నాడు. సేవకుల్ని నియమించుకొన్నాడు. కాలు కిందపెట్టే అవసరం లేకుండా, అన్నిసుఖాలు అనుభవిస్తున్నాడు. అయినా అతడికి తృప్తిలేదు. 'ఎంతడబ్బువుంటేనేం? ఓరగల్లు ప్రభువుకు వున్న ధనంలో నాదేపాటి! ఆయనకున్న అధికారం నాకెక్కడిది?' అనుకోసాగాడు.

కమ్మరికి క్రమంగా దురాలోచనలు ఎక్కువయినై. అక్రంఖాన్ ఖజానాలో మిగిలి వున్న బంగారం, వెండిని యింటికి చేరవేయా లనుకున్నాడు. ఒకనాటి రాత్రి పలుగూ, పారా తీసుకొని ఆ ప్రదేశానికి వెళ్ళాడు. చెట్టు మొదట్లో తవ్వి బండను పక్కకు ఈడ్చి సొరంగంలో ప్రవేశించాడు.

గుండె బితుకుమంటున్నా, దురాశ కొందికీ అతడు సొరంగంలో నడవసాగాడు. చివరకు ధనరాసులున్నస్థలం చేరాడు.

ధనరాసులు చెక్కుచెదరకుండా అక్కడే వున్నవి. 'నయం ఆ ఓరుగల్లాతడు ఎత్తుకు పోయాడు కాదు' అనుకొన్నాడు. వెంట తెచ్చిన గోతాంలో నగలూ నాణ్యాలు నింప సాగాడు. ఆ హడావిడిలో కమ్మరి గంట మాట మరిచేపోయాడు. అది అతడి తలకు తగిలి ఖంగుమని మోగింది.

గంట మోగేసరికి కమ్మరికి గుండె ఆగి పోయినంత పనైంది. అంతవరకూ గోతాంలో నింపుకున్న వెండీ బంగారాలతో బయట పడదామనుకున్నాడు. అలా అనుకుని వెండీ బంగారాలతో నిండివున్న గోతాంను ఎత్తుకొని అటుకేసి పరుగెత్తబోయేటంతలో—

కత్తి చేతబట్టి గోడనీడలో కునుకు తీస్తున్న భయంకరాకారుడు కళ్లు నులుము కుంటూ లేచి—"యిది రాత్రా, పగలా?" అంటూ గర్జించి ప్రశ్నించాడు.

కమ్మరికి హడలెత్తింది. గజిబిజి పడి "యిది రాత్రే!" అనేశాడు. అలా అనీ అనకముందే ఆ భయంకరాకారుడు ముందుకు వురికి కమ్మరిని వడిసి పట్టాడు.

కమ్మరి విడిపించుకునేందుకు గింజు కున్నా, ఆ భయంకరుడి గుప్పెటపట్టు సడల లేదు. చేసేదిలేక కమ్మరి నిలువుగుడ్లువేసి వూరుకున్నాడు. అప్పుడు ఆ భయంకరుడు:

"అక్రంఖాన్ దోపిడీ ధనాన్ని నువ్వు దోపిడీచేస్తున్నావన్నమాట! నలభై ఏళ్ళ నుంచి నేను దీనికి కాపలా కాస్తున్నాను. నా తరవాత ఎవడా దీనికి రక్షకుడు అని చూస్తున్నాను. భలేవాడివి. దొరికావ్!" అంటూ కమ్మరిచేతికి గొలుసులు తగిలించి, గోడను వున్న యినపకమ్మికి బంధించాడు.

ఇక ఆనాటినుంచి అక్రంఖాన్ ఖజానా కావలిపని కమ్మరిపాల పడింది. 'దురాశ వల్లేకదా యీ దుస్థితి కలిగింది' అనుకొని వాపోయేవాడు కమ్మరి. చుట్టూ అంతులేని ధనం వున్నా అనుభవించే యోగ్యతమాత్రం అతడు పోగొట్టుకొన్నాడు.



# రత్నగోళం (అట్టచివరి బొమ్మ) - 4

త్రన రత్నగోళంకోసం భూతసర్పం వెతుకులాడుతున్న సంగతి వినగానే కప్తానుకు వేగిరపాటు కలిగిందని చెప్పాముకద! ఉన్నట్టేవుండి కప్తాను, 'హాఁ!—తెలిసిందిప్పుడు. ఆ భూతసర్పంవద్దనుంచి ఎలాఐనా మన రత్నగోళాన్ని మనం తిరిగి కాజేయాలి!' అన్నాడు.

'సముద్రంలోపలికంటా మునిగి, ఎవరైతే రత్నగోళాన్ని పట్టి తీసుకు రాగలరో వాళ్ళకు కోరుకున్న బహుమతి ఇస్తాము' అని నావికులందరకూ చెప్పాడు. కాని, భూతసర్పానికి భయపడి, ఒక్కళ్ళూ ఈ పనికి సాహసించలేక పోయారు. కప్తాను నిస్పృహచెందాడు. ఏమైనా సరే, రత్నగోళాన్ని సాధించి తెస్తేకాని రాణిముఖం చూడకూడదనుకొన్నాడు.

అలా వెళ్ళగా వెళ్ళగా—జపాన్‌తీర ప్రాంతాలు చేరుకొనేసరికి, బెస్తవాళ్లు చిన్న చిన్న పడవలమీద రావటం కనిపించింది. వాళ్ళవద్దకు పోయి, కప్తాను వాళ్లందరకూ రత్నగోళాన్నిగురించి చెప్పి, బహుమతిసంగతి వెల్లడించాడు. ఎంత ఆశ చూపినా ఒక్కళ్ళూ ఈ పనికి మొగ్గలేదు.

అందులో ఒక పడవమీద ఉన్న ఒక ముసలివాడు మాత్రం కప్తానుకు సంజ్ఞచేసి తనదగ్గరకు రమ్మన్నాడు. 'అయ్యా, కప్తానుగారూ! ప్రాణాలకు తెగించి నేను సముద్రం అడుగుకంటా వెళతాను. నీ రత్నగోళాన్ని సాధించి తెస్తాను. ఐతే, నాది ఒక్కటే ఒక్క కోరిక ఉన్నది. అది మీరు నెరవేర్చ గలరా?' అని అడిగాడు.

అదేమిటని కప్తాను అడిగేసరికి, వాడు 'నేనింక అట్టే కాలం ఈ భూమి మీద బ్రతకబోయేదిలేదు. నాకు ఒక్కగానొక్క పిల్లవాడున్నాడు. వాడు నాలాగ పేదరికంతో బాధపడకుండా, గొప్పవాడై, పేరుప్రతిష్ఠలు సంపాదించుకోవాలనేది నా కోరిక. ఈ పని నెరవేర్చటం నీవల్లనవుతుందా?' అని అడిగాడు.

అందుకు కప్తాను 'నీకే కాదు, నీ కుమారుడికైనాసరే, ఏంకావలసినా చేస్తాను. ముందు, ఆ రత్నగోళం పట్టుకువచ్చి ఇవ్వాలి' అన్నాడు.

'ఐతే, నా కొడుకును నీవలెనే ఒక ఓడకప్తానుగా తయారుచేయాలి' అని కోరాడు బెస్తవాడు. 'అలానే' అని మాట ఇచ్చాడు కప్తాను. బెస్తవాడు అపరిమితంగా సంతోషించాడు.



# భయం అంటే?

ఒకానొక అడవిలోని కొలనుపక్కన వున్న చిన్నయింటిలో ఒక పేదరాలు నివసిస్తూ ఉండేది. ఆమెకు ఒక్కగానొక్క కొడుకు. వాడిపేరు సుమంతుడు. వాణ్ణి చిన్నప్పటి నించీ ఎంతో గారాబంగా పెంచింది తలి.

ఒకనాటిరాత్రి సుమంతుడూ, తల్లీ తమ చిన్నయింటిలో హాయిగా నిద్రపోతున్నారు. వున్నట్టుండి గాలి ప్రారంభమై ఉరుములూ, మెరుపుల్తో వానకూడా ఆరంభమయింది. ఆ గాలివాన శబ్దంవిని తల్లి మేల్కొన్నది. కొడుకును నిద్రలేపి "అబ్బాయీ నాకు భయంగా వుంది. ఆ కిటికీ రెక్కలు కాస్త మూసివద్దూ," అని చెప్పింది.

సుమంతుడు నిద్రలేచాడు. తల్లి మాటలు విన్నాడు. 'భయం' అన్న మాట వాడి జీవితంలో యిదే మొదటిసారిగా వినటం. అందుచేత "కిటికీలు మూస్తాలే అమ్మా, 'భయం' అంటావేమిటి ? అదెలా వుంటుంది ?" అని అడిగాడు.

కొడుకు అడిగిన ఈ ప్రశ్నకేమీ జవాబివ్వలేదు తల్లి. 'కుర్రకుంకకి, యీ వివరాలన్నీ చెప్పేదేవిట్లే' అనుకుని తిరుగా కునుకుతీసింది.

దానితో సుమంతుడికి ఆ 'భయం' అంటే ఎలావుంటుందో చూడాలనిపించింది.

ఇక యిలాకాదు అనుకుని, మెల్లిగా తలుపు తీసుకొని బయటికి వచ్చేశాడు. ఆ చీకట్లో గాలివానలో అడవివెంటపడి 'భయం! నీ వెలావుంటావ్? ఎక్కడ ఉంటావ్?' అని అరుస్తూ పోసాగాడు.

ఆర్. సుగుణమణి

"నాయనా, వచ్చావా? వుయ్యాల అందక యిందాకట్నించి ఎవరొస్తారా అని చూస్తున్నాను. నువ్వు కాస్త నన్ను భుజాల మీద నిలబడనిచ్చావంటే, వుయ్యాలనుంచి మా బాబును కిందకు దింపుతాను" అన్న జవాబు వినబడింది.

సుమంతుడు సరే అని అక్కడికి వెళ్ళాడు. అక్కడ ఒక యింటిలో ఒక స్త్రీ నిలబడివున్నది. పైన దూలానికి వుయ్యాల వేలాడుతోంది.

నిజానికి ఆవిడ మానవస్త్రీ కాదు, రాకసి. ఆ సంగతి తెలీని సుమంతుడు ఆమెను తన భుజాలమీద ఎక్కించు కొన్నాడు. రాకసి, సుమంతుణ్ణి తన కాళ్ళతో నలిపి చంపాలని ప్రయత్నంచేసింది. దానితో సుమంతుడికి కోపం వచ్చి రాకసి కింద పడేలా చేతులతో గుంజాడు.

బ్రహ్మరాకసి బోర్లా కిందపడింది. ఆ పడటంలో నోటికోరలు రెండూ విరిగి పోయినై. కుయ్యోమొర్రో అంటూ అది అక్కడినించి పారిపోయింది.

సుమంతుడు ఆయింటినించి బయటికి వచ్చాడు. అప్పటికి బాగా సూర్యోదయం అయింది. గాలీ వానా వెలిసినై. మరి కొంత దూరం ముందుకు నడిచాడు.



ఒకచోట కొండరాళ్ళమీద కూర్చొనివున్న కొందరు దొంగలు అతడికి కనిపించారు. వాళ్ళు సుమంతుణ్ణి చూచి—

"ఎవడవురా నువ్వు? ఇక్కడ పిట్ట ఎగర టానికే భయపడుతుంది, రాజుగారి సైన్యాలు రావటానికే జంకుతై. నువ్వేమో భయం లేకుండా యిటు వస్తున్నావ్?" అన్నారు.

"ఆ భయం ఏమిటో, ఎలా వుంటుందో చూద్దామనే వస్తున్నాను!" అన్నాడు సుమంతుడు.

దొంగలకు యీ జవాబు నవ్వు తెప్పించింది. వాళ్ళు ఒక పెనం, అట్లకాడా, అట్ల పిండీ సుమంతుడి చేతికిచ్చి—"ఆ చెట్లల్లో




వున్న శ్మశానంలోకి వెళ్ళి, ఈ పిండితో ఒక రొట్టె కాల్చుకురా. భయం అంటే ఏమిటో నీకే తెలుస్తుంది!" అన్నారు.

సరే అని సుమంతుడు శ్మశానంలోకి వెళ్ళి పొయ్యి రాజేసి పెనంమీద రొట్టె కాల్చసాగాడు. ఆ పక్కనే వున్న సమాధి లోంచి యింత పెద్ద చెయ్యి బయటికివచ్చి—

"అబ్బాయ్! నా క్కాస్త రొట్టె రుచి చూపించవూ?" అన్నది.

పని తొందరలోవున్న సుమంతుడికి భలే చిరాకెత్తుకొచ్చింది.

"రొట్టె రుచి చూపించాలా? బతికివున్న వాళ్ళ ఆకలి తీర్చేముందు, నీ ఆకలే తీరుస్తాను" అంటూ చేతిలో వున్న అట్లకాడతో ఒక్కదెబ్బ వేశాడు. ఆ దెబ్బతో చెయ్యి సమాధిలోకి మాయమైంది.

తరవాత రొట్టె కాల్చి సుమంతుడు దొంగలదగ్గరకు వచ్చి జరిగినదంతా చెప్పాడు. దొంగలకు సుమంతుడి నిర్భయత్వంచూసి హడలుచ్చుకుంది.

"బాబూ, నీకు భయాన్ని చూపెట్టటం మావల్లకాదు. యిక్కడినుంచి తొందరగా శెలవుపుచ్చుకో, నీపుణ్యం వుంటుంది! మమ్మల్ని యిలా బతకనియ్యి" అని బతిమలాడారు.

సుమంతుడు అక్కణ్ణుంచి మరికొంత దూరం వెళ్ళేసరికి ఒక వృద్ధురాలు ఎదురైంది. "ఎందుకు నాయనా, యీ అడవిలో యిలా తిరుగులాడుతున్నావ్? మీది ఏవూరు? ఏంపని?" అని అడిగింది.

సుమంతుడు సంగతంతాచెప్పి "అవ్వా, భయం అంటే ఎలావుంటుందో చూడాలన్న కోర్కె యింకా నెరవేరలేదు" అన్నాడు. అందుకు అవ్వ నవ్వుతూ—

"నీలాంటిదే నాకూ ఒక మనమరాలు వుంది. రా నాయనా, నీ కోర్కె అది నెరవేరుస్తుందేమో!" అని వెంట తీసుకుపోయింది.

అవ్వ మనమరాలు భలే జిత్తులమారి. సుమంతుడి కథఅంతా విని ఒక యుక్తి పన్నింది. వేళకాగానే సుమంతుడికి అన్నం వడ్డించి అంత ఎడంగా నిలుచున్నది. తీరా సుమంతుడు అన్నం కలుపుకొని ముద్ద నోట్లో పెట్టుకోబోయేసరికి—

"వుండు, వుండు, వండిన కూరచట్టి తేవటం మరచిపోయాను" అంటూ వంట యింట్లోకి వెళ్ళి ఒక పెద్దచట్టి తెచ్చి అతడి ముందు పెట్టింది.

సుమంతుడు కూరవేసుకుందామని చట్టి మూత తెరిచాడు. ఆ వెంటనే అందులోంచి టపటపమనే శబ్దంవచ్చింది. 'అ౯' అంటూ సుమంతుడు భయపడి వెనక్కు ఒరిగి పోయాడు. చట్టిలో మూత పెట్టబడివున్న పిచ్చుక ఒకటి తుర్రుమంటూ బయటికి ఎగిరిపోయింది. భయమంటే ఏమిటో తెలి యని సుమంతుడు, ఆ పిచ్చుకకేసిచూస్తూ వుండిపోయాడు.

అవ్వ మనమరాలు విరగబడి నవ్వుతూ "యిప్పుడు తెలిసిందా? 'భయం' అంటే ఎలావుంటుందో?" అని అడిగింది.

సుమంతుడికి సత్యం ఒప్పుకోక తప్ప లేదు. "అవును, భయం అంటే ఏమిటో యిప్పటికి తెలిసింది. యిక మా అమ్మదగ్గ రకు వెళ్తాను. మీ యిద్దరుకూడా మా యింటికివస్తే మా అమ్మ చాలా సంతోషి స్తుంది" అంటూ లేచాడు.

మగదిక్కులేనివాళ్లుకనక, అవ్వా మనమరాలూకూడా సుమంతుడి కోరికపై వాళ్ళయింటికి వెళ్ళారు. సుమంతుడి తల్లికి మహదానందం కలిగింది. అందరూ కలిసి ఒకే కుటుంబంగా బ్రతకసాగారు. సుమం తుడుకూడా ఒళ్ళువంచి పనిచేస్తూ, అన్ని విధాలా మంచివాడనిపించుకున్నాడు.

కొన్నాళ్ల తర్వాత, సుమంతుడికీ, యుక్తిపరురాలైన అవ్వ మనమరాలుకూ వివాహం జరిగింది.





# వార్తలు-విశేషాలు

కాశ్మీరులో పిల్లల చదువు అభివృద్ధిచేయటానికి చాలా ప్రయత్నాలు సాగుతున్నాయి. మూడేళ్లు వెళ్ళినది లగాయతు హైస్కూలుచదువు పూర్తిఅయేదాకా పిల్లలకు స్కూలు జీతాలు లేకుండాచేశారు. పిల్లలు చదువుకునేటందుకు పాఠశాలలుకూడా హెచ్చించారు. ఈ పాఠశాలలను నడపటానికి ప్రభుత్వం చేసే ఖర్చుకూడా పెంచారు.

*  *  *  *

మనదేశంలోని గుడ్డివారు తమకు సాధ్యమైన వృత్తులు నేర్చుకుని వాటిద్వారా బతుకు తెరువు చూసుకోవటంకోసరం కేంద్రప్రభుత్వంవారు డెహ్రాడూన్‌లో ఒక సంస్థను ఇటీవల ప్రారంభించారు. ఇందులో గుడ్డివాళ్లు వేళ్ళతో తడివి చదివే పుస్తకాలు అచ్చువేసే ముద్రణాలయమూ, కార్ఖానా ఉన్నాయి. ఈ సంస్థలో గుడ్డివాళ్ళను ఉచితంగా ఉండనిస్తారు. వారికి జబ్బులుచేస్తే ఖర్చులేకుండా మందులిస్తారు. ఇక్కడ పనులు నేర్చుకునేవారు నెలకు 60 రూపాయలదాకా సంపాదించుకో గలుగుతారట.

*  *  *  *

జూన్ 30 న అనేకదేశాలలో సంపూర్ణ సూర్యగ్రహణం కనిపించింది. అమెరికాలో ఈ గ్రహణాన్ని టెలివిజన్ ద్వారాకూడా ప్రసారం చేశారు. కొన్ని దేశాలలో పార్శ్వగ్రహణం మాత్రమే కనిపించింది. చంద్రబింబం సూర్యగోళానికీ భూమికీ మధ్య అడ్డుగా వెళ్ళినప్పుడు సూర్యగ్రహణం కలుగుతుంది. చంద్రుడి నీడ భూమిమీద పూర్తిగా పడిన ప్రాంతాలలో సంపూర్ణ గ్రహణం కనిపిస్తుంది.

*  *  *  *

అలహాబాదు మ్యూజియంకు హమీదాలీ అనే ఆయనా, ఆయనభార్యా కొన్ని అపూర్వ వస్తువులను ఇచ్చారు. చరిత్రప్రసిద్ధమైన వస్తువులను మ్యూజియములలో ఉంచుతారు. హమీదాలి ఇచ్చిన వస్తువులలో అక్బర్ అంతఃపురానికి చెందిన వెండినగలపెట్టె ఉన్నది. దీనిని మ్యూజియంకు ఇచ్చిన హమీదాలిగారు, అబ్బాస్ తయాబ్జీ అనే ప్రసిద్ధ బొంబాయి కాంగ్రెసు నాయకుని అల్లుడు.

*  *  *  *

చైనాప్రధాని చౌ-ఎన్-లాయ్ న్యూఢిల్లీకి వచ్చినప్పుడు భారతప్రధాని పండిత్ నెహ్రూ గాంధీజీ ఉపన్యాసాల రికార్డులను ఆయనకు బహూకరించారు.

అణుశక్తితో భూమిమీద ఒక్క ప్రాణికూడా లేకుండాచేయటం సాధ్యమేనని ఒక అమెరికన్ అణుశాస్త్రవేత్త ఇటీవల ప్రకటించాడు. అందుచేత అణువు బాంబులతో ప్రపంచ యుద్ధాలు జరిగితే చాలా ప్రమాదం వున్నది. కనుకనే ప్రపంచ శాంతికోసరం అనేకమంది గొప్ప రాజకీయవేత్తలు పాటుపడుతున్నారు. అటువంటివారిలో మన భారతప్రధాని నెహ్రూ ఒకరు. ఈయన ఈమధ్య చైనాప్రధాని అయిన చౌ-ఎన్-లాయ్‌ని మనదేశానికి ఆహ్వానించి ఆసియా శాంతినీ, ప్రపంచ శాంతిని కాపాడగలందులకు చర్చలు జరిపారు. ఆసియాలో గల ఇండియా, చైనాలు ప్రపంచంలోని పెద్దదేశాలలో చేరినవి. ప్రపంచ జనాభా 200 కోట్లకు పైగా వుంది. అందులో 96 కోట్లు చైనా, ఇండియాలలోనే ఉన్నారు. కనుక ఈ దేశాల నాయకులు శాంతిని కాపాడటానికి పూనుకోవటంవల్ల చాలా లాభం వుంది.

*　　*　　*　　*

హిమాలయ పర్వతాలలోని అత్యున్నత శిఖరా లెక్కటానికి అనేకదేశాలవారు ఏటా ప్రయత్నిస్తూ ఉంటారు. ఎవరెస్టు శిఖరాన్ని ఎక్కడానికి జరిగిన ప్రయత్నాలు కిందటేడు నెగ్గాయి. ఈయేడు గౌరీశంకర శిఖరాన్ని ఎక్కటానికి ఒక జట్టు బయలుదేరనున్నది. ఈ జట్టుకు నాయకుడు రేమండ్ లాంబర్ట్ అనే ఆయన. ఎవరెస్టు శిఖరాన్ని ఎక్కిన షెర్పా టెన్సింగును ఈ జట్టువెంట తీసుకుపోవటానికి యత్నాలు జరుగుతున్నాయి.

మకాలూ శిఖరాన్ని ఎక్కటానికి ప్రయత్నించిన కొందరు అమెరికనులు విఫలులై దిగి వచ్చారు. గాడ్విన్ ఆస్టిన్ అనే శిఖరాన్ని ఎక్కటానికి ఇటాలియనుల జట్టు యత్నిస్తోంది. వారు పైకివెళ్ళే దారిలో ఉన్నారు.

ఇదివరకు ఎవరూ చూడని రెండుకొత్త శిఖరాలు హిమాలయ పర్వతాలలో ఇటీవల కనిపెట్టబడ్డాయి. వీటిని కనిపెట్టినది భారతీయులే.

*　　*　　*　　*

మనదేశపు దేవుళ్ళలోకెల్లా భాగ్యవంతుడు తిరుపతి వెంకటేశ్వరస్వామి. ఈయనకుగల నగకట్టు విలవ రు. 75,66,906-2-0 లు అని ధర్మాదాయ బోర్డు కార్యాలయంవారు అంచనావేశారు. రెండవ స్థానం శ్రీరంగంలోని రంగనాథస్వామివారిది. ఆ ఆలయానికి చెందిన నగకట్టు విలవ రు. 38,40,638-8-6 లు మాత్రమే.

*　　*　　*　　*

ఇంతకుపూర్వం ప్రపంచంలో ఎవరూ నాలుగు నిమిషాలలోపు కాలంలో మైలుదూరం పరిగెత్తినట్టు దాఖలా లేదు. అది సాధ్యంకాని పనిగాకూడా భావించబడింది. కాని ఈమధ్య బానిస్టర్ అనే బ్రిటిష్ వైద్యవిద్యార్థి 4 నిమిషాలకు అరసెకండు తక్కువ కాలంలో మైలు దూరం పరిగెత్తాడు. జూన్ 21 న జాన్‌లాండీ అనే ఆస్ట్రేలియన్ మైలుదూరాన్ని 3 నిమిషాల 58 సెకండ్ల కాలంలో పరిగెత్తాడు.

ప్రపంచ స్త్రీలలో మైలుదూరాన్ని అతి తక్కువకాలంలో పరిగెత్తినది డయాన్ లీథర్ అనే బ్రిటిష్ స్త్రీ. ఈమె సరిగా అయిదు నిమిషాలలో మైలు పరిగెత్తింది.

# చిత్రకథ



దాసూ, వాసూ వాళ్ల పాఠశాల వార్షికోత్సవానికి మొసలీ, ఎలుగుబంటీ వేషాలు వేసుకు వెళ్ళారు. ఉత్సవంలో తతిమ్మా విద్యార్థులతో కలిసి నాట్యాలుచేశారు. తరవాత అదే వేషాలతో యింటికి బయలుదేరారు. వీళ్లనిచూసి కొందరు పిల్లలు నిజంగానే మొసలీ, ఎలుగుబంటీ అనుకొని భయపడి పారిపోయారు.



యిద్దరూ కలిసి బస్సు ఆగేచోట నిలబడ్డారు. బస్సువచ్చింది. వీళ్ల వేషాలుచూచి బస్ కండక్టరు బస్సు ఆపదలుచుకోలేదు. లాభంలేదని దాసూ, వాసూ వాళ్ల మొహాలు చూపించారు. బస్సు ఆగింది. యిద్దరూ లోపలకు వెళ్ళారు. ప్రయాణీకులు వీళ్ళనిచూసి "అబ్బాయిలూ, మీరు అసలు రూపాలలోకంటే, యీ మొసలీ, ఎలుగుబంటీ రూపాలలోనే బావుంటారు!" అంటూ నవ్వసాగారు.

Printed by B. NAGI REDDI at the B. N. K. Press Ltd., Madras 26, and Published by him for Chandamama Publications, Madras 26. Controlling Editor: SRI 'CHAKRAPANI'

Photo by C. P. Patel



బహుమతి
పొందిన వ్యాఖ్య

అనుచరులు

పంపినవారు :
వి. ని. నియోగి - రాజమండ్రి

